# గజదొంగ.

లండనుపురము, గ్లాడ్స్టన్ గ్రాండు హోటలు, క్రామ్వెలువీధి,
సుందరమందిరము.

లండనులోని హోటలును స్థాపించినవాడు పార్సీవాడు. హిందూదేశమందు ధనమార్జించి, కోటీశ్వరుడు కావలెనని యెంచి యీపన్నుగడ చేసెను. ఎవరిని చూచినను హిందువులనే గుండంవెయ్యవలెననెడి తలంపేకదా! ఈయన పేరు "ఇంద్రసేనజీబాయి." కొంతసొమ్ము వెచ్చించి పెద్దమేడకొని అందున నీహోటలు యుంచెను. అందముగల చిత్రమేమన, శ్వేతకన్యలకు జీతములిచ్చి నూతనముగా వచ్చెడి హిందూవిద్యార్థులను, వెల్కముచేసి, హోటలునందు ప్రవేశపెట్టి వారికి తగు సపర్యలు జరుపుటయే! అయితే ఒక సంగతి. వీరికన్ని భాషలును వచ్చును. జీజీబాయి పెద్దకాలేజీపెట్టి అందులో నీకన్యకలను తర్ఫీదుచేసి హోటలులో నౌకరి యేర్పాటుచేయుచుండును. రెండు సంవత్సరములు ప్రతికన్యక, పనిచేసి తీరవలెను. అదిషరతు. భారతవర్షములో నెన్నిభాషలుగలవో ఆభాషలన్ని యచ్చట నేర్పుదురు.

కృష్ణయ్య, చెంగయ్య, బలవంతరావు, విఠలదాసు మున్నగువారు క్రిందటి వేసంగిలో యింగ్లండుపోయి, ముందీగ్రాండు హోటలులో ప్రవేశించిరి. అందు కృష్ణయ్యసాబ్కి నాయుడయ్యె. వారమురోజులుకన్న నీహోటలులో విద్యార్థులుండకూడదు. తనకు వెల్కమొసంగిన "మేరీ" ని ప్రేమించసాగించెను. ఈకన్యకలు 18,20, వత్సరములుగల తరుణవయస్కులు. అచ్చటి ఆచారము, ఎంతకాలమో అనుసరించినకాని దరిచేరనివ్వరు. అందున కృష్ణుడు తన కార్యమును మరచి, అదేలోకములోబడి కాలము వ్యర్థబుచ్చసాగెను. ముందు మేరీతో స్నేహముచేయవలెను. అందునకై యెన్నియో చిత్రవిచిత్రములు, తనుచేయవలెను. డబ్బుకర్చుపెట్టవలెను. ఒకరోజున మోటారులో థేమ్సునదీతీరమున సంచారముచేయుచుండ, మేరీ "కృష్ణా మీదేశంలో వ్యవహారస్థితి యెట్లున్నది? వివాదలు, కేసులు, తకరార్లు, ది

లాంటివిలేక సెమ్మదిగా ప్రేలుండిరా?" అని ప్రశ్నించెను. "మాదేశంలో యిటీవల జనులలో తగాదాలు, హేళీలు, వ్యాజ్యాలు మెండై ధనవ్యయము మిక్కుటముగా నున్నది. ఒకరిని మింగినవారు, మరొక్కరు బయలుదేరుచు న్నారు. కోర్టులెక్కువయిన కొలది లిటిగేషను యెక్కువగుచున్నది. దీనికి కారణము, మీమా సమ్మేళనఫలమని నేను తలంచెదను." ఇట్లని మాటలాడుచు హోటలునకు వచ్చిరి. మేజాబల్లవద్దనిద్దరును కూర్చుని "టీ" పుచ్చుకొనుచుండ, మేరీ "కృష్ణా! ఏదైన యొక కథచెప్పుము. ఆకథ మీదేశస్థితిని తెలియజేయునదిగా నుండవలెను. అప్పటి జనులలో యేవిధమున హేళీలు బలమై, బాధపడుచుండిరో వినవలెనని కుతూహలము కలిగించినది. చెప్పుము" అని అడుగగా కృష్ణుడు "మేరీ! వినుము. నీవు తెనుగు చక్కగా మాటలాడుచుంటివే? ఎక్కడ నేర్చుకుంటివి?" నీకీవిషయము తెలియదా? మేము ప్రత్యేకము మీదేశజులకై యిక్కడ శ్రీబాయిగారి కాలేజియందు నేర్చుకుందుము. అయినను నీవు మాటలాడిన మాటలుకొన్ని నాకర్థముకావు. మొత్తముమీద సంగతితెలియును". "అట్లయిన వివరిగా చెప్పెదను. తెలియనిచోటనన్నడుగుము. దేశములో మాన్యులు దురాచారములకు దాసులై, యదార్థజ్ఞానము లేక మూఢులై చరించుచు, దుర్మార్గమున కలవాటుపడియుండిరి. ఇది యిటీవల లభ్యమైనసంగతిసుమా! పిల్ల యెన్నటికో వంచిమార్గముచిక్కుట. కొందరు భర్తలు ప్రయత్నములు సల్పుచుండిరి. మూఢజనులు వానిలాభములను కనుగొన లేకుండిరి. కథచెప్పెద వినుము." అని కథాప్రారంభము.



—: ఓం :—

# పరీక్షమకల్పము.

## ఉంగుటూరు కోనేరుగట్టు.

---

వైదికబ్రాహ్మణుడగు వెంకటశాస్త్రికొడుకు సన్యాసిలింగం, నరసింగంతో షికారుగావచ్చి కోనేరుగట్టుమీద చల్లగాలికి కూర్చొని యిట్లుమాటలాడ దొడంగిరి. మేరి! ఈసందర్భమును తిన్నగావినుము.

స.—ఏమండీ! నరసింగంగారూ! నేనొకసంగతి విన్నాను. నిజమేనా?

న.—ఏమిటావింత?

స.—వింతేమున్నది! నేనువాకినున్నమాట నిజమే! కానిఆమెకెంతసహాయం చేశాడో మానాయనామెకే తెలుసులెండి! మొగుడుపోయిన తరువాత దుక్కినలె రాత్రింబగళ్లు గడపకదలక, కాపుకాచేదుకదా! అయితే యిప్పుడక్కడ కొత్తమంత్రము లుపదేశించేరు. ఆమంత్రాంగంచేత ఆమె తమతావుకు నోటుపంపినట్టువిన్నాను. నిజమేనా? మానాయనకిప్పుడక్కడవ్యవహారం బెడిసింది. అక్కడపురాణంకూడా మానుకున్నాడు. పెద్దవాడైనాడు. పళ్లూడేయి! బోసివాడు.

న.—నిజంకాదూమరి! రేపటితో వాయిదా వెళ్ళిపోతుంది. దానాకు పంపింది. నీవు కనపడతావేమో అని చూసినాను. నీవురాలేదు. నన్నేంచేయ్యమన్నావు?

స.—అందుకే మీతావుకు వచ్చినాను. అదికాక మరొక కేసున్నాది. అగతినుకే వకాల్తినామా యిప్పించుతాను. తమరిందులో నాకొకసహాయంచెయ్యాలి.

న.—ఏంసహాయం? సరేకాని మేమువేలాములు వెచ్చించి పెద్దపెద్దపరీక్షలుపాస్ చేస్తామే! మాతోపాటు ఫీజుమీకు యివ్వవలసినదేనా? మీలాంటి ప్రైవేటుప్లీడర్లకే మాకంటె లాభంగాయుందే! నేను సఖంయివ్వను. మూడోవంతు యిస్తాను.



స.—మీ అభిప్రాయం అదా ? మేమంతా గాలిని పోగుచేసి మీ యెదట పెడితే కొంతవదిలి కొంత కల్పించి పనిచేస్తారు. మేములేకపోతే మీ తెలివెందుకు ? కనుక తోలికష్టం మాది. తరువాతిమీది. అందుచేత చెరిసగం. మేము ప్యాసు లేదు కాని మీకంటె "లా" మాకే యెక్కువ తెలుసును. అయితే నిన్న మొన్నటిదాకా మేము గంతబొంత తగిలించుకొని కోర్టులోకి వచ్చి వాదించే వాళ్లము. మీ సంఖ్య యెక్కువ కావడంతోటే మా నోటికి తాడు కూడ పడింది. నాయనా ! అందుచేత చెరిసగం. ఇది న్యాయమే ! ఏమంటారు ? నేనా బి. యల్. అంతే ! ప్యాసు లేదు.

న.—ఏమనవన్నావు ? నీయిష్టం. నీవు మైనారిటుడవు. నీమాట కాదంటానా ! ఇందులో మట్టుకు మూడవవంతే సుమా ! తీరెనా ?

స.—ఇందులో మట్టుకైతే సరేకాని నామాట యేంచేసేరు ?

న.—ఏమిటది ?

స.—ఆ నోటుమాట !

న.—ఏంచేయమన్నావు ? పగలా ! పండగలా ! వేతే ! అబ్బా ! ఇది అసాధ్యమే ! ఆముండమోపి యేడవదా ? నాకీకరువు తోచకుండాదే ! దెంగా వేతే ! నా పల్లకాగే ! అమ్మో !

స.—ఇది అనగా యెంతండి ?

న.—నన్నేమి చేయమన్నావు ? చంపమన్నావా ? లేక నీచేతికియ్యమన్నావా ? ఘోరము ! ఘోరము !

స.—మీకు తెలియనిదేమున్నది ? ఇదరవన్నోది ! ఇది తప్పితే చూడండి మీ ఫయిలు ? నా ఫయిలంతా చేస్తాను. మీకు కేసులు రాలేదని చింతించకండి. వెనక నేనన్నానుకదా ! మీకేం ఫర్వా !

న.—అయితే సరేకాని ఒకయుపాయం చేదాం. నీవీరాత్రి కామాక్షి యింటికిపోయి, రేపు ప్రైకం తెస్తాను. నోటు తెప్పించండి. వృధా కర్చులు తగులుపాకెందుకు అని చెప్పి యింటికిపో !

స.—నేనూ అదే యుపాయం ఆలోచించినాను. అయితే తరువాత ?

సం.— "చూచేరా! యిందులో చాలా కష్టపడాలి. సంచిఅని చెప్పండి. జిల్లాకోర్టుకేసు. యెన్నివాయిదాలు పడాలో! అసిస్టెంటుప్లీడరుండాలి" అని చెప్పండి.

న.—సరే! పోయి రేపుఉదయం సొమ్ముయివ్వాలి. లింగం సరేఅనుచు చంకలెగరేయుచు యేమో యిట్లనుకొనుచు యింటికి పోయెను.

"కార్యమంతా నేనే చెయ్యాలి. అయినవందలు దండగాయివ్వాలి కదా! సాధ్యమైనంత వరకు యివియివ్వకుండా యెగొయ్యాలి. అక్కడికా నోటూరద్దు చెయ్యాలి! యిక్కడికీఅయినవందలు సున్నచుట్టాలి. ఏంచెయ్యాలో తెలియడంలేదు. పోనీయీ కేసులోసంచి ఫీజుయిప్పిస్తానంటేసఖంయివ్వనన్నాడు. సఖం యిస్తేనాచేతికాసు ఖర్చుకాకుండా పోతుంది. మాదాంతే! యేలాసఖం యివ్వక పోతాడో? ముందు మనకార్యం గట్టెక్కుతుంది కదా! ఆయువాక చూతాం! ఇందులో గుమాస్తా పేరియుండడు కదా! ఉంటే పని నేంచేస్తుంది! వాడిమొఖాన్ని యింత తగలేస్తాను. వాడి మొహరుసరి. సాక్షి కోసం నేనే కదా? దానికేంగానియిప్పుడు నావద్దగ రెండువందలున్నాయి. రేపునగ సింగానికివర్తించి తిక్కున దానికి నోటువ్రాసియిస్తాను. పప్పుకోసమేమి చేస్తాడు! అటుపైనచూదాములే? నోటు నేమిచేసెదను? చింపివేసెదనా? అమ్మో! అట్లాచెయ్యకూడదు. ముక్కలుకనపడునే! కొంపమునుగును. జైలు ప్రాప్తము సిద్ధము. అదికాదు. తారీకు తెలియకుండా అక్కడే చిన్నముక్క చింపితే! అయితే యిందులో చాలా తెలివియుండవలె. ఆమె యెరుగనే యుండునే? మేజిక్కు చెయ్యాలి. ఏంచేతును? పోనీ! ఒక్కసారి వ్రాతచేసి చప్పున మింగుదునా! అన్నిటికంటె యిది బాగున్నది. దీనికన్న యింకొకటిచేసిన యెవరికీ యిబ్బంది లేదేమో? తారీకుదిద్దుతే! శాస్త్రిచేతికి సంచియిచ్చి, నోటులెఖ బెట్టుమా, దిద్దకూడదు?- అమ్మో యివన్నిటి కంటె బాధకము. అంకె దిద్దుతే వారం దిద్దాలి. తిథిదిద్దాలి. చాలా కాలంపట్టును.

ఇంతాఅయితే ఆముండ మోపి యెదురుగా జరగాలి. చాలా కష్టం అదిగాక యీలోగా యిదిఅరుస్తే యిరుగు పొరుగు వారు యెవరు వస్తారో! వెంకటపతి వస్తే రోగం కుదురుతుంది. ఇదిబాగులేదు. గుప్పు చప్పుగా మింగి కూర్చుంటాను. అయ్యో! నాకేం తోచటం లేదే! గుండె కొట్టుకొనుచున్నదే! ఆవూసు యెత్తితే యీలాగుందే! రేపాకార్యం యెట్లాచేస్తానో! భగవంతుడా! యక్షేశ! మాయిల వేల్పువు. మొన్న నేకదా నీకాహుతి తృప్తిగా యిచ్చియుంటిమి. ఇంకలో కూడా గెలిపిస్తివా నేను స్వయంగా నీ కర్పిస్తాను. నాతాత ముత్తాతల వలె నీ సేవ జేసి తరించెదను. ఇంతకు మనోధైర్యం యుండాలి. ఏమైనను సరే, స్వరూప నాశనమే చేసిన దిగులులేదు. తంటా తీరును.

ఇదిమంచిపని. అప్పుడు నన్నను వారెవరు? కూస్తాను బాగున్నది." అని పన్నగడేపల్లియింటికేగి, భోజనానంతరము కామాక్షి యింటికేగి, పైకం రేపురయం తెస్తానని చెప్పి, మరలయింటికిపోయి నిద్రించెను. కాని నిదుర పట్టదు. తెల్లవాళ్లు పీడకలలచే, బాధనొందెను. ఒకప్పుడు తన్నెవరో కత్తులతోనరికి హింసించినట్లును, ఒకొకప్పుడు తన్నుచు యమాలయమునకు గొంటుకొని పోవునట్లును, వేరొకప్పుడు భయంకరమైన అగ్నిలో పడవేసి వేసినట్లును, కలలుగనుచు, మ్రుచ్ఛిపడుచు, కాలమారాత్రి గడిపెను. తెల్లవారినది. కోనేటివద్ద నరసింగం, అగసుమాస్తాలో మాటలాడి రేపురయం పెందలకడ రమ్మని నరసింగంయింటికేగెను. శాస్త్రి "యేనో డావునొక నపని మాస్లేదు సంతోషిస్తున్నాను కాని కొంపలు ముట్టుకుంటాయని తెలియకున్నాను. నాకెందుకు నావు చెప్పినపని చేసెదను. నాకుముట్టేమా మూలు ముట్టిందే లింగానికి పనిచేస్తానా? యనుచు శాస్త్రియింటికేగెను".

## 2 వ కల్పము.

### కామాక్షి మందిరము.

అటుపిమ్మట వినుము మేరీ! కాలమనంతము నిర్మలము. కాలమహి

వనిర్వచనీయము. కాలవ్యత్యాసమువలన పరిణామ భేదములు అనంతములు. మానవ జీవితములపై ప్రతిబింబితములు. కాలధర్మము దుర్గ్రాహ్యము. పాపము కామాక్షిభర్త వైదికవృత్తివలన యీరెండువేలరూపాయలు సంపాదించి లింగం తండ్రికి వదలిచ్చెను. అబ్బాకొడుకులచేత, నోటు వ్రాయించుకొనెను. భర్త బ్రతికున్నంతవరకు, కామాక్షి కుటుంబముపై నెంతో ప్రేమతో ఆదరముతో లింగం కుటుంబవారుండిరి. ఆయన అంతరించుటతోనే డబ్బు ఎగవేయవలెనని కొడుకునకు దురూహ కలిగెను. కాలవైపరీత్యమేవనవచ్చును!

సన్యాసిలింగం యీసంగతి తనతండ్రి వెంకటశాస్త్రితో చెప్పకనే, మరునాడు రెండు వందలరూపాయలు తీసుకొని నరసింగంగారియింటికిపోయి సొమ్మిచ్చి, తక్కినదానికి నోటు వ్రాసియిచ్చెను. అంతట లింగం గుమాస్తా శాస్త్రి, కామాక్షియింటికిపోయిరి. లింగం చంకలోనున్న సంచితీసి యెదట పెట్టుకొని, "ఏమండి కామాక్షమ్మగారూ! నోటుతీయండి. పైకం యెంచుకోండి" అనిచెప్పగా కామాక్షమ్మ, శాస్త్రిని లోనికిపిలిచి "శాస్త్రిగారూ! పైకంతెచ్చినాడట, నోటుతీసుకొనిరండి అనిచెప్పెను. అంతే అలాగే అనిచెప్పి శాస్త్రి పెట్టెకువెళ్ళి కొంత యిటుఅటుతిర్గి లోనికివచ్చి నోటు కామాక్షిచేతికిచ్చెను. అంతలో లింగం, శాస్త్రినిపిలచి, పక్కవసారాలోకి వెళ్ళి గుసగుసలాడచుండిరి. ఈసంగతి పక్కనున్న యింటి అరుగుపైన ప్లీడరుగారికై వేచియున్న పార్టీలో ఒకడు లోనికిపోయి, ప్లీడరుగారితో చెప్పగా, వసారాకు తనయింటికిమధ్యనున్న మొండిగోడచాటుననుండి వినుచుండెను. లింగం, శాస్త్రితో "యేలాగైనా యీనోటునపహరించవలెను. నీకట్నంయిస్తాను. ఇదిగో తీసుకో" అని లెక్కపెట్టి పాతికచేతికిచ్చెను. ఈ సడి వెంకటపతికన్ని మెల్లగా దొడ్డిలోవను తానుపోయెను. ఒకరైతు సింహ ద్వారమున మెల్లగా లోనచొచ్చెను. ఇంతలో లింగం కావలసినపని చేసి కూర్చునెను.

కామాక్షికొక కుమారుడు కలడు. వాడు పదేండ్లపసివాడు. అప్పుడే

కామాక్షి "యింత అన్యాయముచేయవచ్చునా? కొంపముంచేవే!" అనితగాదా పెట్టుచున్నది. కేకలువేసినది. దొంగలు, దొంగలు,అనియు, మోసము చేసినాడనియు యింకేమేమిఅనియో అరచుచుండె. ఇంతలో వెంకటపతిని చూచి"అయ్యో! ఈముండాకొడుకు నానోటును అమాంతంగా మింగినాడండి రెండు వేలు మునిగినవిబాబూ! దిక్కు లేనిదానిని మీరేదిక్కు! ఏందారి! ఏంబుద్ధి! ఎవరుపాలించేవారు. పాపంశాస్త్రి నైకం లెక్క పెట్టవలెనని సంచివిప్పుచున్నాడు. యీలా రెండి. నోటుపడ్డికట్టవలెనన్నాడు. ఇంతలో మింగుతాడాఅనినమ్మి యిచ్చినానుబాబూ!బాబు! అదుగో లేచిపోతున్నాడు చూడండి. పట్టుకోండి. అప్పుడే సింహద్వారం దాటుతాడు. రెండిబాబూ! పట్టుకోండి దొంగపోతున్నాడు. పట్టుకోండి" అనివెంటపడ్డాది. కామాక్షి ఎదురుగావచ్చుచున్న గామిరెడ్డికి లింగం యెదురుపడ్డాడు. భీతినిపడ్డాడు. రామిరెడ్డి యీగల్భాపిన్నాడు. అక్కడ వాడక్కడనే వెనకకు తిరిగిలింగం వెంటపడి పదిబారలు పోయినతరువాత, లింగంచెయ్యిపట్టుకొని "కామాక్షమ్మగారు మిమ్ముల పిలుచుచున్నది. పదండి" అని చెప్పెను. "చెయ్యివిడువుము. కామాక్షియెవరు? ఆమెకు నాకు సంబంధమేమి? నాకు వేరే పనియున్నది. పని నష్టమగును. ఆనష్టమునకు నీవు బాధ్యుడవు." అని లింగం దబాయించి చెయ్యివదలించుకొన ప్రయత్నించెను. కాని రెడ్డి బలశాలియగుటచే, విడువక త్రిన్నగా కామాక్షియింటికి లింగాన్ని తీసుకొనివచ్చెను. వెంకటపతి లోననే యుండెను. గుమాస్తా శాస్త్రిసంచితీసుకొని పారిపోయెను. యీసంగతిశాస్త్రి నరసింగంతో చెప్పెను "వాడివెట్టుప్రిక ముక్క తెగదు. రుజువులేదు. సాక్షంలేదు. మనకెందుకీసంగతులు. మనది మనవళ్ళోపడ్డది. కాని ఇది పెద్ద కేసు అవుతుందేమో? నీవుమాత్రం జాగ్రత. నాకేం తెలియదు. నేను పోలేదు. అని చెప్పి తప్పించుకొనుము." అని నరసింగం చెప్పి ఏదీ ఆసంచి యిటుతెమ్మని సంచివిప్పిచూడగా నందు, గాజుముక్కలు, చిల్లపెంకులు కొన్ని అద్దణాలు మున్నగునవి యున్నవి.

"అయితే శాస్త్రి! నీవు లెక్కపెట్టలేదా యేమిటి?" అని నరసింగం ప్రశ్నించ, "యింకా సంచి విప్పలేదు. ముడివిప్పేను. ఇంతలో నోటు

యిటుఅటు తిప్పిచూసి, చప్పున వెనుకకు తిర్గి దగ్గినట్లు నటించి చప్పున మింగినాడు. చేతులో చెల్లకాగితం మట్టుకు పట్టుకున్నాడు. అయితే చాలాకష్టపడ్డాడు. మింగటానికి ఇంతా అయితే మనిషి పారిపోలేక పోయేడు. దొరికేడు. ఆరెడ్డి యెదురుగా వచ్చేడు. మనపతిగారు దొడ్డితోవను వచ్చేడు. అబ్బా! అదెక్కడి కేకలు వేసిందండి! ఆగల్లాభకు పిల్లలు వచ్చినారు. నన్ను వెంకటపతి చూసినాడు. రెడ్డి చూసినాడు. నేను మాత్రం " రెడ్డి " తో అతుగో దొంగ పారిపోతున్నాడని చెప్పి తప్పించుకొని యిటుపారిపోవచ్చినాను. అప్పుడు రెడ్డి నన్ను విడచి లింగం వెంటపడ్డాడు. ఇదిసమాచారం. తరువాత యేమైనదో తెలియలేదు. అయితే మనమీదికి రాదుకదా ? "

" మనమేంచేసేం ? రుజువేమిటి ? నన్ను చూడలేదుకదా ! నీవు చుట్టపుమాపుకు వెళ్లినానని చెప్పు. చెప్పలేదు. వాడికింతకు మూడినది. ఇక యేలా తప్పుతుందో ! యూపరితో అనకుమా ! అని నరసింగం మాటాడకూరకుండెను.

కామాక్షియింటికి రామిరెడ్డి లింగాన్ని తీసుకొని వెళ్లెను. అక్కడ వెంకటపతి కూర్చొనియుండెను. దోవలో లింగం బహుతంటాలు పడ్డాడు. రెడ్డికి లంచి యిస్తానన్నాడు. వదలలేదు. తుదకు రెడ్డికి 9వందలిచ్చి, సాకును నను రాకుండ మాటలాడెను. మొత్తానికి వారింటిమీద సాక్షానికివచ్చేడు రామిరెడ్డి. డబ్బుమహాత్యం ! ఇంతలోమార్కెటునుండి కామాక్షిఅన్న, కూరగాయలు పట్టుకొనివచ్చెను. అప్పటికి పగలు పదిఅయినది. అన్నతో అన్ని సంగతులు కామాక్షి చెప్పింది. విని "రంకుపెన్నులు తన్నుదునా? నీఅబ్బఎవడురా దిక్కులేనికు! చండాలుడా! నీవుబ్రాహ్మణజన్మమెత్తి యీలాంటిసందాలకృత్యంచేస్తావా? నీబతుకుమీద నిప్పులుపొయ్య" అనికాలెత్తి తన్నపోయెను. రామిరెడ్డి సర్దెను.

రామిరెడ్డి, వెంకటపతి, సన్యాసిలింగం, కూర్చొని మాటలాడుచుండిరి. కామాక్షియింతలో వెంకటపతి సలహావలన పోలీసుస్టేషనునకు తనచిన్న కుమారునకొకచీటినిచ్చిపంపెను. కామాక్షిఅన్న కొంచెంవైద్యంలో గట్టివాడు. వెంటనే " యిపికాకు " డోసు తయారుచేసి "లింగం ! సరేనీవుచేసిన సంగతి

తెలిసినది. అయితే సామ్మమాట యేమిచెప్పెదవు? అడుగుతే కొంతతీసి వేతపెట్టవయ్యా! ఎందుకు మింగేవయ్యా?" అంటే, "అబ్బే! నోటేమిటి! నేనేమిటి! మింగడమేమిటి! నేను అలాపోతూయుంటే యీ వెంకటపతి సలహాతో రామిరెడ్డి నన్నుపట్టుకొని యిలాపట్టితెచ్చినాడు కాని నాకేం తెలియదు. వాళ్ళిళ్లలో వెంకటపతికినాకు సరిపడదు. వాళ్లలో వెంకటపతికి నాకుసరిపడదు. అందుచేత యీలానామీద కేసుచెయ్యాలని యింత హడావిడి చేసినాడుగాని వరివకటికాదు. కావాలంటే చూచుకోండి నా జేబులు, బట్టంతా విప్పతాను. చూడండి నేనకూడా స్త్రీడరునే నాకుమాత్రం లా తెలియదూ! అలాంటితప్పుపనిచేస్తానా? ఎక్కడికి పోలేదుకద్దా! చూడండి. నేనుమింగినానని ఆమెఅంటూయున్నది. సరే నాకుకక్కువందుయివ్వండి మింగియుంటే కడుపులోనుండి బైటపడునుకదా! సరేనా! ఇకనాతప్పేమి?" అన కామాక్షిఅన్న రుక్మాంగదదీక్షితులు డోసుగ్లాసులోపోసి తెచ్చి "అయితే తాగుమని గ్లాసు చేతికిచ్చెను.

చేతులు వణకుచుండ, ఒడలు కంపమెత్త లింగం గ్లాసును చేతబట్టుకొని తాగుచుండగా, పోలీసు సబిన్స్పెక్టరు, యిద్దరు కనిస్టేబుల్సు సింహద్వారముగుండలోనికివచ్చిరి. కామాక్షిపోలీసువారికన్ని సంగతులు తెలియపరచినది. ఈసందడిలో, లింగంనోటివద్దపెట్టుకొని మింగినట్లునటించి కొంత డోకువచ్చినట్లు డోకెను. కాని నిజంగా మందును తాగక గోడపైన చల్లివేసెను. యీసంగతి వెంకటపతి చూచుచుండెను. ఏమయ్యా! పారబోసితివని, "తాగితిని. డోకువచ్చినది. ఏమియుపడలేదే" అనిచెప్పుచు "చూసిరా అప్పారావుగారూ? నన్నుపరాభవంచెయ్యాలని యీవెంకటప రామిరెడ్డి బలవంతంగా యిక్కడకు యీడ్చుకొని వచ్చి మీకు కబురు చేసినారు. నాసంగతి మీకు తెలుసునుకదా! నేనను యీస్త్రీడర్లతో పాటే ఫసంగాయుంటూయున్నానుగదా! మీసాహేబుగారికి తెలుసునావిషయము. స్టేషనులో యీ ఖాబసాహేబుగారు లేరండి? వారికి బాగాతెసును" అని చెప్పెను. ఇంతలో దీక్షితులు మరియొక, డోసు తయారుచేసితీసుకొనివచ్చెను. "ఏమిటండీ! బాగున్నది అదేపనా! ఇప్పుడేగదా తాగింది

నేను తాగను." అని తిరగబడినాడు లింగం. అంతఅప్పాజీరావుగారు ఏమి టండిఅన "చూడండి నేనట! పిరికోటట! నలిపిమింగినానట! ఇదెక్కడి కథండి. వీళ్లకు నాకు సంబంధమేమిటి?" అని చెప్పగా రావుగారు "సరే ఆలాగైన నాయెదుట మరొకసారి మింగండి. మందు, గోనయుండదట! మీ రాడోసుమగోడమీదజల్లినారట! అందుచేతనాయెదుట తాగండి" అనలిం గం విధిలేక గళముపైకెత్తి మందును గటగట త్రాగెను. తాగిన ఒక నిముష మునకు ఒకచిన్న తెరవచ్చి కొంచెము తెమడ కక్కెను. మరికొంచె సేపటికి పెద్ద తోకువచ్చి, సగము జీర్ణించిన కాగితపు వుండ బైటపడెను. వెంటనే ఆవుండను ఆకక్కును గిన్నిలోనికత్తించి, లింగానికి బేడీలు వేసి, డాక్టరుగారి వద్దకు తీసుకొని పోయెను. ఆకాగితపు వుండ జీర్ణకోశములో పడి యుంటన్న గుటచే కొంచె పచ్చి అక్షరములన్నియు కలసి పోయి మాసిపోయినవి. అ యితే బాకీమొత్తం రెండువేలు అని వ్రాసినది బాగా కనుపడు చున్నది. కాగితము నిండా తెమడైయున్నది. నీరుమయమైయున్నది. అది మెల్లగవిప్ప గాచిరి. ఫలానావారు ఫలానావారికి వ్రాసియిచ్చిన మాటలు పూర్ణముగా కనుబడడములేదు. ఆమొయింటి పేరు కలదు. వ్రాసిచ్చిన పేరు బాగా కనుప డుట లేదు. వారికు కనుపడు చున్నది. అణాబిళ్లమీద సంతకం కలిసిపో యినది. సాక్షి సంతకం మోట కొంత తిని పోయినది. వ్రాసిరి యెవరైనది బాగా గుర్తుపట్టుటకు వీలులేదు. లింగం దస్కతు పోలితి పట్టవచ్చును. డా క్టరు గారి వద్దకు తీసుకొని పోలీసువారు పోయిరి. డాక్టరు గారి కంటికు యు స్నే నరసింగం వేరే మనిషి ద్వారా సంచి పంపి యీదెబ్బతో మనలింగాన్ని కాపాడాలి లేకపోతే మాలింగ బ్రతుకు చెడుతుంది అని వెయ్యి సంచి పంపినాడు. డాక్టరు, పంకు చేసి నీటితో తడిసినట్లున్నది. మింగితేమింగియు డవచ్చును. "కాని ముఖ్యంగా మింగినాడు, స్టమకు జ్యూసులో నుండి వచ్చినది" చెప్పుటకు తగిన కారణములు లేనట్లున్నది. కానియీకాగితము కొంత జిగురు జిగురుగానున్నది. సిరా కరిగి అక్షరములు గుర్తుపట్టలేము. రెండు వేలు అని మాత్రము అక్షరములున్నవి. "చిటికాల" అను పేరు బాగా యున్నది. బిళ్లమీద అంతా అలికినట్లున్నది. గంటన్నర నానినట్లున్నది. ము

త్రంమీద నోటు చీకినట్లున్నది." అని సర్టిఫికేటు యిచ్చినాడు. అంతట పోలీసువారు లింగాన్ని కోర్టులో పెట్టినారు. ఈసంగతి విశ్వనాథంవిని రామశాస్త్రికి కబురు చేసెను. ఇంతలో కేసరిశాస్త్రి అంతయుమున్నే విని యాఖూబుసాహేబుతో మాటలాడి యింటికి పోవుచుండెను దోవలో రామశాస్త్రి కేసరిశాస్త్రిని కలుసుకొని యిద్దరును విశ్వనాథం గారింటికి పోయిరి.

---

## 3 వ కల్పము.

మేరీ! చూస్తివా! స్నేహ ఐకమత్యము!

దుర్గాదాసు తనప్రియస్నేహితునకట్టి విపత్తు సంభవించినదనివిని, నరసింగం విశ్వనాథం ప్రేరణవలన చెన్నపట్నంపోయి, బేరిష్టరును మాటలాడి వెంటనే మరునాటియుదయం 6 గంటలకు మేలుమీద ఉంగుటూరునకు తీసుకొనివచ్చి, పదిగంటలకు మేజస్ట్రీటువద్ద బెయిలు యిప్పించవలెనని అర్జి పెట్టించెను. బేరిష్టరుగారి వాగ్ధోరలకు విషయమేమియు దెలియక, నేనిచ్చుటకు వీలులేదు. జడ్జిగారికి అర్జీయిచ్చుకొమ్మని తీర్పువ్రాసి బెంచిదిగిపోయెను. వెంటనే వేరొక అర్జివ్రాసి ఒంటిగంటకు జడ్జిగారికి అర్జీపెట్టెను. జడ్జివిచారించి సరేబెయిలుయిచ్చినాము. 20 వేలకు జామీనియ్యవలెననెను.
చార్యులు, సుబ్రహ్మణ్యం, చెరిపదివేలకు జామీనిచ్చిరి. వీరును ప్లీడర్లె వెంటనే యీఆర్డరునకు నఖలు దరఖాస్తుపెట్టి వందఖర్చుచేసి కేసరిశాస్త్రి ఆర్డరును, యినస్పెక్టరు యాకూబు సాహేబు గారికి ముట్టునట్టుచేసి మధ్య బంట్రోతునకు పదిచ్చి, పంటాలుపడి సన్యాసిలింగాన్ని జైలునుండి తీసుకొనివచ్చి విశ్వనాథంగారియింటికి పోయిరి.

సాయింత్రం నాలుగైనది బేరిష్టరుగారికి సంచియిచ్చినారు. రానుపోనుఖర్చులిచ్చి పట్నంపంపిరి. "అయ్యా! ఖుషురుమళ్ళీ రావాలండీ. మీరే యీకేసుసాంతంఆయ్యేవరకు!" అనగా అల్లే! మాదేమిటి? అంతా డబ్బులోనేయున్నదనిచెప్పి సాయంత్రంబయలుదేరి పట్నంపోయెను. విశ్వనాథం యింట్లో రామశాస్త్రి, కేసరిశాస్త్రి కలసిమాటలాడజొచ్చిరి. మేరీ! యీ

సంగతి గమనింపవలసినసంగతి- విద్యార్థులైనందుకు సార్థకమిదేసుమా? మాదేశంలో "కలికాలమహిమ" అనెడిసామ్యముకద్దు దానియదార్థమిదియె! వీరందరు న్యాయవాదివర్గలే!

వి.—ఏంవోయి! ఏలాగవునో! లింగం తేలుతాడామునుగుతాడా? ఈసంగతినాతో మొదటనేచెప్పితే, మనమంతాకలసి యేద్నోయుపాయం పన్నేవాళ్ళమే! అంతామించిపోయిందే! యేంచేస్తాం? ఎంతతెలివితక్కువపని చేసినాడోయి?

రా.—నిజంగా రాతిలింగమే అయితేమునుగుతాడు! మనగాలి- అందులో సందేహంలేదు. అక్కడ యెంలినేఫ్రకూర్చున్నాడండి? ఇంటికుచేసిన పనిచెడుతుంది. అదే ఒకసంకిలి. పోనిస్తుందా? చూడండి మన గుమాస్తా శాస్త్రి పోతేపోలేదు! అతనితోపాటు పోతేపోకూడదగా! లేక అంకె దిద్దుతే పోదండీ! మొన్నమీరు అలాచేయించి తప్పుకోలేదండి? ఎన్నియున్నాయండి! ఇంతకుగ్రహచారం! జండు లింగం అయితే తేలాలి! చూదాంలెండి!

కే.—సరే! గ్రహచారంగనకనే యీలాంటి అపసబుద్ధులుపుట్టటం. దానికేమిలే! మనవృత్తి అగిత్తె వారతే! లేకపోతే ఎవరో ఒకరు, వెంకటపతివంటి నిప్పంటివారుంటారు! అదాక్షిణ్యమా! లోకమంతా యిదే కదూ! చూడండి! మనంయింతవరకు పట్టుపడినామా! మొన్నటికేసులో ఒకటిఅచూకిచిక్కలేదే! కోర్టులో కాగితాలుకూడా మాయంచేయించేము. డబ్బుఖర్చుపడ్డా, శ్రమపడ్డా, తుదకు మనంగెలిచేంగనుక యేమిలేనట్లేయున్నది! దెబ్బంటే మనదే దెబ్బ! వెంకటిగాడు తంటాలుపడ్డాడు. లాభంలేకపోయింది. మళ్ళీయిందులో జోక్యపుచ్చుకున్నాడు. మనకుఅడ్డంగాయున్నాడోయి? ఏలాగైనా తంటాతీరుద్దామంటేఏదీఆలోచనదొరకడంలేదుఏమిలేదండిప్రయోగం చేయిద్దాంచస్తాడులేకపోతేయెందుకండీ! సరేకానియీ కేసులోముందు దోషయేమి?పోలీసువారప్పుడేవిచారణకుమొదలుపెట్టేరువనసాహెబు

మనమీదఅంతగా సాక్ష్యం పోగుచెయ్యకుండా నేను చేస్తానుగా! పట్నంలో మేమంతా క్లాసుమేట్లమండీ! అదిమీకు తెలియదా యేమిటి? దుర్గాదాసు, నేను, పట్టుకున్నామంటే మళ్ళీతిరుగుతాడా! రామశాస్త్రి యీలాగే మాట్లాడుతాడు. పారెడటు, పారెడిటు! నాదిపూచి, యిందులో గెలవలేకపోతే నిజంగా పీనుగునే! చూడండి వాదెబ్బ! తుదకు కేసు వెంకటపతిమీద పడేట్టు అల్లిస్తాను. సాహెబు మనచేతిలోవాడండి. అయితే యిప్పుడు అలాచే యించకూడదు.

మనం ఆయనతో పగలు మాటలాడకూడదు. కలెక్టరునకప్పుడే రిపోర్టు పోయినది. అతిపట్టుదలగా యున్నాడు. జాగ్రత్తగా విచారించమని సాహెబుగారికి రహస్యంగా తాకీదువచ్చినదట. నాతో చెప్పినాడు. భయంలేదు.

వి.—అయితే ఒకసంచి ఆయనకు తోయ్యండి.

శే.— అట్లా పుచ్చుకొనేవాడు కాడు. అయినా సరేనండి. నేను ప్రసంగించిచూస్తాను. ఇన్నేళ్ళే మానియుంటుంది. (లోనలో) యింటికి నా పుణ్యం వచ్చింది. ఈ కొయ్య ఒకటే ఖాయంగదా! లోకినలకు, తిండికిమొత్తానికి నూరురూపాయలు లంచం పుచ్చేడు. నాసొమ్మేమిపోయినది. పనిచేస్తాను. తప్పతుందా అంతా నాపనే అంటాను. చూస్తాము. తప్పదా! మన వెంకటాచలం, వెంకటపతి ముఠాలో చేరుదాం.

వి.—అయితే మనసంగతులు నేను మాట్లాడి అంతా ముందు పరిష్కారం చేసుకొని మరీపనిలోకి దిగాలి.

ఈలోపుగా సన్యాసిలింగం, నరసింగం, దుర్గాదాసు, విశ్వనాథం గారి యింటికివచ్చిరి. అంతా కలసి పన్నాగంపన్నుతారు. మేరీ! తెలియుచున్నదా! మా భాషనీకర్థమగుచున్నదా? వినుము!

దు.—శాస్త్రీ! వింటివా? ఇంతవరకు చేసిన ప్రయత్నం ఫలించినది. అయితే వకటి డబ్బుజల్లితేనేకాని పనికాలేదు.

స.—డబ్బుదేమిటిలెండి! పనికావాలికాని!

వి.—అలాగనకుమరి! డబ్బులో లేదూ లేదు దేవుడు! అది లేకపోతే బ్రతుకే లేదు.

న.—స్వామీ! మీ యిష్టం! ఏలా చెయ్యమంటే అలా చేస్తాం. నన్ను కూడా కలిపి తెస్తారట! ఆసంగతి కూడా ఆలోచించండి.

కే.—దానికి నాది పూచీ నీకొచ్చిన ఫర్వాలేదు. ఒకసంచీ పట్టాలి. ఏమంటావు?

వ.—సరే నీ చేతికి యిస్తాను. రాత్రి మా యింటికి రా. నా పేరు చార్జిలో లేకుండా చెయ్యి. ఈ కాస్తా పట్టూ పూడితే బ్రతికేదెట్లు?

కే.—లింగం! డబ్బు ఏలాగోయి? మొన్న యిచ్చిన అంతా ఖర్చులయింది. ఆ వెయ్యి వాడికినెత్తిన జనేన, సరేలెండి మీకెందుకన్నాడు. డబ్బు లేదే! ఇందులో ఆరెడ్డిని కట్టాలి. వెంకటి గాడు వినడు. అతీ ఆనష్టమేను. ఏంచెయ్యమన్నావు. అయినా వాడిదాపం తీర్చలేము కొద్దిలోపడేవాడు కాడు. రి పేరియ్యాలి. వాడిది వదిలి చెయ్యి.

స.—అదే ఆలోచన! నాతావున డబ్బులేదు, బ్రతికియుంటే మీరుణం తీర్చుకుంటాను. బాబూ! అంతా నానాయన తవరంచేసేడు. డబ్బు లేకనే గదా యీపని చేసేను. నానాయన నన్ను పెట్టిన తిప్పలు చెప్పితే ఒక చరిత్ర పట్టుతుంది. వాడికేమి అంతా మింగి, బోసిపులివలె, ఆలిగిరి కోతివలె, కళ్లురుస్తూ యుంటాడు ఎప్పుడూ! ఏమోకమ్ముతుందని యీపని చేసేను. ఏంచెయ్యను? ఏంబుద్ధి బాబుల్లారా! మీరేదిక్కు. ముంచినామీరే! తేల్చినామీరే! మిమ్ములనే నమ్మినాను నరసింగం! నీవు చెప్పితే కదా యీపని చేసేను? లేకపోతే చేస్తానా?

న.—ఎంతసంగనాచివోయి!. నేనా యీపని చెయ్యమని చెప్పేను?. ఎంత అబద్ధమోయి! ఇప్పుడైనా నిజం చెప్పరాదా!

స.—నిజానికి యీపని చెయ్యమని చెప్పలేదు కాని యేదో యిలాంటిదే చెయ్యమని చెప్పినావు. సరే కాని నన్ను నీవు బ్రతికించాలి. లేకపోతే యీ కోనేటిలో అర్ధరాత్రి పడిచస్తాను. అయ్యో! ఎంత అపకీర్తిపాలు కావలసివచ్చినది? ఎంత అమర్యాదపని! నాకెందు కీపాడు బుద్ధి పుట్టినది?. అప్పుడా కాస్తాయిస్తే కొంత తీసివేత పెట్టేదే! గ్రహచారము!

కే.—సరే! యీవైరాగ్యాలకేమి కాని, పైకం మాటచెప్పు! రెడ్డికి రెండు సంచులియ్యాలి. తక్కినవాళ్ళకు మరినాల్గు సంచులియ్యాలి. ఒక వేళ మేజిస్ట్రేటుకియ్యాలేమో? మొత్తానికి 10 వేలుండాలి. ఏమంటావు?

స.—సరే నేను కాదన్నానా? ఆవున్న 20 యెకరాలు అమ్మండి. ఇట్లున్నది. అది తాకట్టో, అమ్మడమో చేస్తాను. ఇదంతా మీరేచేసి పెట్టాలి!. ఏమంటారు?

వి.—అయితే నాకు ఫవరాపటర్ని యివ్వను. ఆలాగే! ఈరోజు లేదు కదా!, రేపు వ్రాయించండి. రిజష్టరీచేస్తాను.

కే.—సరే! యికకానియ్యండి.

దు.—మనమంతా యిందులో మద్దత్తుచెయ్యాలి. ఈ వేళ లింగానికి వచ్చింది. రేపు మనకువస్తుంది. అయితే సుబ్బ తెలివితక్కువ పని చేసేను. ఎవరితో చెప్పేనుకాను. నరసింగంతో చెప్పేను. అదికోమటిరహస్యమైనది. కొంపమునిగింది. కొంచెం గర్వంకూడా యున్నది. అంతస్వాతిశయముండకూడదు. మన ఆలోచనకుమించ చెప్పవాడు లేరని మనోగర్వం. ఒకరు మనకు చెప్పేవారా! అయినా మొన్న తప్పుకోలేదా! ఆలాగేయిది. అనుకున్నాను. అన్నివేళలు మనవి అవుతాయా? తెలివితక్కువ!.

రా.—అయితే అతనికి వచ్చినదని మాట్లాడుతావా! న్యాయమా? ఎవరికైనా వస్తుంది యిబ్బంది! దానికేమి! లింగం యిక నీవువెళ్లుము. దాని విషయమాలోచించి పనిచేస్తాములే! నీవు మాశాఖవాడివిన్ని, మా వృత్తినే అవలంబించి నాడవు. అంతమాత్రం అభిమానంయుండదనుకున్నావా యేమిటి? పో! ధైర్యంగా యుండు. నీప్రాణానికిమాప్రాణంఅడ్డు. భయంలేదు. సరేనా!. లింగం మెల్లగ విశ్వనాథంయిల్లు విడచియింటికేగెను. విశ్వనాథాదులు ప్లానులువేయుచుండిరి. మేరీ! ఆసంగతి వినుము.

వి.—శాస్త్రి!, ఒకటి నిజమోయి. లింగానికి అతిగర్వమోయి. అన్నీ తనకే తెలుసునంటాడు!. ఒకరిని లెఖచేయడు. అతిబడాయి. స్వోత్కర్ష. అబ్బా! ఆనడిచేటప్పుడు చూడు! ఆబోరవిరచి నడవడం. అందరిని మొగతాళి, హేళనచేస్తాడోయి. వాడుచేసేపను లిలాంటివి. తనంతటివాడు లేడనడం. సర్వం తెలిసిన వానివలె నటించడం. నిర్లక్ష్యం. ఎంతమాటపడితే అంతమాట ఎవరనిపడితే వారినిఅనడం. నీడికి ప్రాయశ్చిత్తం కావాలి. అయితే కులాభిమానం, వృత్త్యభిమానం, పీకుతున్నాయి.

రా.—అలాగనకండి ఏదోయింత డబ్బుంది. అదీమీచేతిలోనే పెట్టేడు: విషయమున్నా . లేకున్నా, యింతదడబిడలుగా వాగుతాడు. అందులో పెద్దసంఘములెండి! ఏదోచిన్నవాడు. మన, తోడిబేరమే చేస్తున్నాడు. అభిమానం లేకపోతే యేలా.?

డు.—శాస్త్రి! యెంతఅభిమానమోయి! మీయిద్దరు యెందులో కలసిపని చేస్తిరి? అదేనా యీ అభిమానం? మన విశ్వనాథంగారు చెప్పినవన్నినిజం. వాడివంటివిని పాడుకొన్నవి. అవి పెండున్నరతో పోవాలికాని యిందులో శిక్షయినా, తేలినా పోనేపోవు సుమా?.

కే.—ఈ దెబ్బతో వదులుతాయా? ఏమో అబ్బా! వదలవు. ముత్తానికి బైటపడతాడులే! ఇంతడబ్బు! వృధాయేనా? ఎప్పటికీకాదు.

ప.—కాని వెంకటపతిని పిలిపించి చెప్పాలి. వాడొక విగపుకొయ్య. వంగడు. వాడిప్రాణాలు నాచేతిలోయున్నవి. మొన్న కేసుమాట అప్పుడే మరచేడా! అవంతా మరింతకల్పించి నాసాక్ష్యంలో చెప్పనా?.

కే.—పిలిపించండి. తెలుస్తుంది. ఏదెట్టులైనా లింగాన్ని బ్రితికించాలి ఎన్నిఅబద్ధాలాడినా ఒక యిల్లు నిలపమన్నాడు. పాపం యింకా పిల్ల, మేకా, లేనకదా! ఆవగింజలో అరభాగం కాలేదు.

వి.—అవును కాగేకాగేపాటం, మావికాగినపాటు. స్వతంత్రించి చేసేదు-తాంగేదు. బోర్లపడవలసినదే! ఇంతల్లో మనంపూడేం కొంతదగ్గింది-

ఇక పొంగకుండా చేదాం- ఇందులో ఎంతఆలోచన చెయ్యాలి- ఎందరిని కట్టుకోవాలి- మాటలేనా యీలాంటిపనులు చేయడం.

రా.— గుమాస్తా అప్పయ్యశాస్త్రిని పిలిపించి చెపుతాను. నరసింగంగారూ! మీరుకూడా యీ పద్దత్తు చెయ్యాలి. యీరోజునయీగండంగడిచింది. ఈనెల 25 తారీఖువాయిదా అట. అంతాకళింగంపోవాలి. ఆమేజస్ట్రీటు వింతమనిషి. మనంచేసేపని చెయ్యాలి. ఏమంటారు. నేను పోతాను, అని వెళ్లెను.

ని.— కేసరీ! మేజస్ట్రీటువద్ద దిట్టమయిన లాయరును పెట్టాలి. మనమందరం పోవాలి. దాసు, నీవు, శాస్త్రి యెప్పుడుతియ్యకుండా హాజరుకావాలి. నేనురాను. బాగుండదు. ప్రతిమాట వ్రాయాలి. సాక్షంగా వస్తాను. అయితే కేసరి! నీవుమాత్రం పోలీసువెంబడుండి సాక్షమంతా వెంకటపతిమీద పడేటట్టుచెయ్యాలి. ఇదినీపని. ఎందుకంటే! వాడుకూడా " ఆస్పాటు " లో నున్నాడు. అలావప్పుకుంటాడు. దీక్షితులు, పతి, కలసియీపన్నాగం పన్నేరనిచెప్పాలి. ఒకవేళ యిక్కడ గెలువకపోయినా పైన తప్పించవచ్చును. ఆలాకేసుబనాయించవలెనని మనసా హెబుగారితో చెప్పి మన లింగాన్ని తప్పించాలి సరేనా ? " అన సరే యని అందరు వారి వారిండ్లకేగిరి. " కేసరి ఫ్రూరాడప్పు తింటాడు. సరేదొంచేస్తాం ! ఒకరుమాత్రం తినరా ! వాడిముందా మోసిరి. తిననీ ! మనసొమ్మేంపోయెకదా ! " అనివిశ్వనాథం తనలో గొణుగుచు భోజనానికి లేచిపోయెను.

---

## 4 వ కల్పము.

## వెంకటపతి గృహము.

మేరీ!, వేంకటపతి పడకకుర్చిలో పడుకొని ఆకాశమువంక చూచుచు " ఇప్పటికి మంచిసమయము దొరకినది. ఈ తప్పుడులింగం నాచేతిలో

చిక్కినాడు. వీడికోగం కుదర్చవలె. అందరికి అన్ని వేలు పంచిపెట్టుచున్నాడు. ఈదెబ్బలో నాకేమైన వేస్తాడేమోయనుంటే దమ్మిడి మనదాకా రానియ్యలేదు. కక్కుర్తిపడదామంటే అదిసాగేటట్టులేదు. వీడివిర్రవీగుతనం ఈదెబ్బలో మాన్పాలి. పదిమందిలోనైనా, జంకుగొంకులు లేకదులబరించుతాడు. అతియెగతాళి చేస్తాడు. అక్కడికి తాను శ్రేష్ఠాదికుడైనట్టు. పోనీయిదిమైనా జరుగుతే మంచిదే.! ఈసంగతి వెంటనే కలెక్టరుతో స్వయముగా పోయి మాటలాడితిని. నావలన తగిన కయఫీతు తీసుకున్నాడు. అందులో యున్నదున్నటుల చెప్పినైగా బాగాబిగిసేటట్టు తానుపేనెను. కానివక్కతోటిపెద్దరు నాకు సహాయం రాలేదు. అయితే కొందరు వీడికి యిందులోప్రాయశ్చిత్తం అయితే మంచిదే! యెన్నటికి మరిచేయను. అనేవారేకాని ధైర్యంగా నాకుమద్దత్తు చేయలేదు. ఇంతచదువుకొని యిలాంటి పనులు చేయడమా! మాకంటె విషయములు, యెక్కువ తెలుసునే! నిజం, అందుచేతనే యింతకైనాను. లోకులను ముంచవలెనని పట్టేను. మొన్న ఒకనోటు సామ్ములో అంకె సవరణ చేసి తప్పించుకున్నాడు. ఇందులో యెట్లాతప్పించుకుంటాడు? చూస్తానుగా! ఊరికే పోనివ్వను.

ఇనస్పెక్టరు నేను యిద్దరు కనిస్టీబులు, రామిరెడ్డియింతమందిముంటిమే! వైగా సోకుమందిచ్చిన దీక్షితులున్నాడు. పిల్లవాడిసాక్ష్యం. ఇదంతా యెలాతప్పుతుంది. ఈతడవ ద్వీపాంతరవాసమో. లేకయేడేండ్లు కఠిన శిక్షో తప్పదు. ఒకటిరెంట తప్పుకోవచ్చును. ఇదిమూడవది. ఇందులో దెబ్బతిని తీరవలెను. లేకపోతే నామీసం గొరిగించుతాను. రేపటినుండి మీసం పెంచాలి. అయితే లింగం డబ్బు శనగపప్పువలె జల్లుచున్నాడే! ఎంతటివాడైనా ఆడదాన్ని డబ్బునిమాస్తే వెనకముందాడడుగదా! మేజిస్ట్రీటుకేమైన మెరుపుచూపుతాడేమో! అందులో కళింగం మేజస్ట్రీటు పచ్చితురకవంటివాడు. కావడానికి శూద్రివాడే! దయదాక్షిణ్యములు లేవు. లంచాలుపట్టడు. ఇక్కడ కమిటుమెంటు తప్పదు. అయితేజిల్లాజడ్జి వద్దయేమగునో? ఉత్తమెతగమనిషి. అందులో క్రిష్ణవర్మవద్దకేయీకేసు. పోయిందా తప్పకశిక్షవిధించును. బహుకరుకుమనిషి. సిఫార్సులుగిఫార్సులు పట్టడు.

డబ్బు అసలెదగ్గరకు రానియ్యడు. ఏలాగుంటుందో! కేపుసోమవారం కేసు వాయిదా. రామిరెడ్డి జాకేటట్టున్నాడు. అయితే గట్టిగాపట్టియుంచేను ఒకసంచి యిచ్చేరనివిన్నాను. అడిగితే లేదన్నాడు. దీనినిబట్టిచూస్తే కేసు కొట్టివెయ్యడు కదా! చూడాం హైకోర్టుదాకా చూస్తాం. సామాన్యంగా వదలం. కామాక్షికి డబ్బుపెట్టుబడి పెడతాను. అయితే వకచిక్కువచ్చి నది. పోలీసువారు వసంతుడయ్యన్నట్లే యున్నారు. యూఖూబుఖాన్ ముందుప్రమోషనుకై తంటాలు పడుతున్నాడు. యిందులో లింగాన్ని జై లుకుపంపేడా! కేడ మూపెంటలోకి పోతాడు. కలెక్టరు మంచి పట్టుదలతో యున్నాడు. నిజానికి యీలింగంచేసేడు కదా! యిదికనిపెట్టేవాడు లేడు కదా! సాక్ష్యం బలంగానేయుంది. డాక్టరుయెదుట జరిగినాబాగుండేది. మామాటలునమ్ముతారా? ఆ! నామాటనమ్మకపోతే మరెవ్వరిమాటలునమ్ముతారు. నాకేం సంబంధంలేదు. ఏదోగల్లాభజరుగుతుంటే, వెంటనేవెళ్లి చూసేను. అంతాకళ్లారచూసినదానికి తప్పేదేమి? కానీసరసింగు పూరామ ర్ఖుడు లింగానికి శిక్షన్నాడు. లమాణ్ వకటే లింగాన్నికూడా యిందులో కలుపుడని చెప్పితే కలుపలేదు. అందుకే యీకోపం. కానిచూతాం! క్రిష్ణవర్మకేపడాలి కీడరోగం కుదరాలి. అయితేవర్మవిచారించకూడదేమో? ఆ! చెయ్యాకేమి? లేకకీపరావుకు పేస్తాదెమో! ముందుపెన్నదాటనియ్యి! తరువాత తిప్పలు చూడవచ్చును. ఇదిపెద్దగడ్డు. నేనంతా సిద్ధంగాయుండాలి. సమనలు వచ్చినవి. మొత్తానికి మాకు డబ్బుబాగా ముటుతున్నది పైలుచార్జీలు పండ్రకర్చులు పెళ్లకర్చులు టీకినలు బలే! కేసుయెట్లులైనా సరే చూతాము "[అనిటీసలో తానే అనందించుచు పెంకటపతి కాలము గడుపుచుండెను. ఇదంతయు యెలుకకు ప్రాణసంకటముకాదా!



## 5 కల్పము.

## పోలీసుస్టేషను.

యాఖూబుఖాన్ సాహేబు, కేసరిశాస్త్రి, రామిరెడ్డి, స్టేషనులో కా న్కీగదిలో కూర్చొని మాట్లాడ దొడంగిరి.

కే.—రామిరెడ్డి! రేపు సాక్ష్యం యేలా చెపుతావో?.

రా.—మీరేలాగు చెప్పమంటె అలాగే! నాకెందు కీపాపం!

యా.—ఇందులో జాగ్రిత. నేనేమైన చెప్పమని యన్నట్లుచెప్పకూడదు. అంతా నేను చూచినది. ఇందులో అబద్ధం లేదు. నీవుపట్టుకోవడం కామాక్షియింటికి వెళ్లడం అదిచెప్పు. దానిలో తప్పులేదు, కాని లింగం కామాక్షి యింటిలో నుంచి వస్తున్నాడు అని చెప్పవద్దు. సరేనా? అదిగాక కాగితం డోకటం విషయములో నేను దూరంగా కూర్చున్నాను. వారు బ్రాహ్మలు. వంటింటివద్దజరిగింది. మేము నడిం వాకిలికి ప్రక్కదా యున్నాము. అని తప్పకో! సరేనా.?

రా.—అలాగే!. నాకు యిబ్బంది లేకుండా చెయ్యండి.

కే.—నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం. సరేనా ఇందులో నేముంది. చూసేవా! ఆలింగం తెలివితక్కువ!. వెధవరెండువేలు గిరగిర తిప్పి పారవేస్తే పొయ్యేది! ఇప్పుడు చూడు యెన్ని వేలూ ఖర్చు పెట్టుతున్నాడో! ఈ శిక్షజాలదా? కాని బాబు! రామిరెడ్డి! ఇందులో పుణ్యం కట్టుకోవాలి! యేలాగైనా ఒడ్డున వెయ్యాలి. ఇది టర్నింగు పాయింటు సుమా? చూచేవా వనసాహేబుగారు ఎంతపట్టుపట్టినారో! ఔదార్యమంటె వారిదే! పైనుండి మాట వస్తుందన్నా లక్ష్య పెట్టక అంతా గవర్నమెంటు పక్షంగా పనిచేస్తున్నట్లు కనపడి ఒక "పూరుసోలు"ను కాపాడ తలపడినారు. నాయనా! ఇవిచేతులు కావు. కాళ్లు. ఇదుగో! పాపం! లింగం, బైటతిరగటం లేదు కదా? అయితే మొండికత్తి ధైర్యంగాయున్నాడు. ఎందుకో తెలుసునా?

భావిలోనో కోనేటిలోనో పడితే పండువంటి సంసారం పాడైపోతుంది. లేకపోతే ఒక యేడో, మూడేండ్లో పోతాడు. కూర్చుంటాడు. అని ధైర్యం. మరి మాలాంటివారి మీద భారం వేసుకున్నాడు. మీది ప్రథమ సాక్ష్యం ఏమంటారు?

రా.—సరే కాదన్న దేమున్నది! మొన్న అన్ని సంగతులు చెప్పేరుకదా! అలాగే జరగనియ్యండి. నాదేమున్నది.

కే.—అలాగంటే కాదు. ఈ పచ్చని ఆకు పట్టుకొని ప్రమాణం చెయ్యాలి.

రా.—ఇక్కడ కాదు. మీయింటికి రేపుదయమున వచ్చెదను. అక్కడే చేస్తాను. సరేనా, చేస్తానుగా! ఇందులో తప్పేమిటి?

కే.—సరే! అలాగే! తప్పక రావలెను.

రా.—అయితే నేను వెళ్లుతాను. కొంచెం బజారులో పనియున్నది. శెలవు సాహేబుగారు అని వెళ్లెను.

కే.—సాహేబుగారూ! వీడు నమ్మించి మోసం చెయ్యడు గదా!

సా.—అసలే మోసపు కేసు. ఏలా చెపుతాం.

కే.—సరే! ఇదేమిటండీ! మీరు యీలా మాటలాడుతారేం!

సా.—మరేమనుకున్నావు! నీవు స్నేహితుడవు గనుక అన్నాను. నిజం చెప్తాను విను. ఊళ్లో టాముకున్నావా! నీవు నాదాపుకు పగలు రాకు. మనమిద్దరం కలసి యీ కేసు పాడుచెయ్యాలని యున్నాముట! రమెంతోపింపు నాతో అంటు. అయ్యో! మేము పోలీసువారము. అన్ని సంగతులు అంతుతియ్యాలి అందుకు ఆపార్టీలతో నుండాలి. యీపార్టీలతోనుండాలి. అని చెప్పుతున్నాను. రేపటినుండి పగలు రాకు. రాత్రి సునఖాతాదారులు "చిలకముక్కు" యింటకపదికొండుస్సైనరా! అప్పుడు మనము తా అంతో కస్తాగా మాటలాడవచ్చును. విన్నావా! ఇదే చెప్పటం సుమా!

కే.—సరే! బాగాయున్నది. అయితే దానింటికి పదిమంది వస్తారుగదా! అదెట్లా?

సా.—మనం చేపట్టినతరువాత అన్నికట్టుపడ్డాయి. మనకలెక్టరు సాహెబ్ వస్తారు ఆయన మనకుమద్దతేగదూ!

కే.—అబ్బా! ఆయనవింతమనిషి. ఒకప్పుడు లింగానికిపడాలని, మరొక ప్పుడు పాపం తప్పించాలని అంటాడు.

సా.—సరే దానికేమిలే! నీవెప్పుడు పైమేతగాడవు.

కే.—మీరుకొంతకాలం మడికట్టుకొంటారు. తరువాత ఎక్కడికిపోవాలదు. సరేకాని శెలవుయిప్పిస్తారా? పోవాలని సాహేబువద్దనుండి "చిన్న. గావిశ్వనాథంగారి యింటికిపోయి, యీసంగతిచెప్పి, రామిరెడ్డిని మనవాడినిగా తిప్పినాననియు, పైకం రెండు సంచులియ్యవలయు ననియుచెప్పి, అటనుండి నరసింగం యింటికిపోయి వానితో మాట లాడి దుర్గాదాసును కలుసుకొని వాని కీరహస్యమునుచెప్పి రామ శాస్త్రి యింటికేగి కొంతముచ్చటించి కేసరియింటికేగెను. సాహేబు డేవనువిడచి కామాక్షియింటికిపోయి, ఆమెవల్ల అన్నిసంగతులు కైఫీతు తీసుకొనెను. తరువాత వెంకటపతి యింటికిపోయి, స్టేటు మెంటును తీసుకొనిపోయెను. అటనుండి అప్పయ్యశాస్త్రిని కలుసు కొని సంగతివిచారించెను. "అంతకుముందే ఆమెతో మాటలాడుటకు పోతిననియు, నాకామె దూరబంధువనియు, నేనుండగా, లింగం రాలేదనియు" చెప్పికైఫీతిచ్చెను. తరువాత నరసింగంయింటికిపోయి, నిజస్థితియడుగగా, "ఇందులో నాకేమియు తెలియదనియు, నోటు నాలుగురోజులక్రిందట వచ్చినదనియు, వెంటనే తెప్పించుకున్న దనియు, నోటులోసంగతులు నాకు తెలియవనియు, లింగాన్ని బాగా యెరుగుదుననియు. ఒకరికిబాకీ యుండవలసినవాడు కాడనియు, నాకెన్నడు యీసంగతి చెప్పియుండలేదనియు, బాకీయుంటే నా తో చెప్పితీరుననియు, అంత, నాకు అతనిక స్నేహమనియు," యున్నగు సంగతులుచెప్పుచు, ఈసంగతి నాగుమాస్తాకు తెలియదు. నాకుతారీఖు జ్ఞాపకంలేదు. మొన్నరెండు వేలనివిశ్వాను. నా

గుమాస్తా చదవలేదు. ఆమెకు యెవరుబాకీయో నాకు జ్ఞాపకంలేదు.
అప్పుడు చదివినమాట జ్ఞాపకంలేదు. అయితే యీలాంటివి యెన్నో
వస్తాయి. జ్ఞాపకమా? తరువాతసంగతులు నాకుతెలియావు." అని
మొదలగు సంగతులతో ఆయనవద్దనుండి యీసంగతులువిని యింటి
కిపోవుచు. "ఇంగులో నరసింగం సుద్ధబద్ధంమాటలాడేడు. అసను
నిజంచెప్పినట్లయిన లింగానిక జైలుప్రాప్తి సంసిద్ధమేకదా! పోనీ
బ్రాహ్మడు! బతికనీ! మాకేం! వాళ్ళంతాయింత అబద్ధాలాడుతూ
యుంటేనాకేంపట్టేరిది! ఇందులో నాస్నేహితులు పట్టుపట్టేరు, లేక
పోతే ఒకపట్టుపట్టాలని అనుకున్నాను. నిజంగా యేంకోపంవచ్చింది!
బాగా సంపాదించ మొదలుపెట్టేడే! డబ్బుపారవెయ్యరాదా? ఎంత
పనిచేసేడు చాలాసాహసం! ఎవరుచేస్తారు? ఈకాలంలో యింతకట్టు
మస్తిగాయుండే ప్రభత్వంలో యీలాంటిపని చేసేడే! ఇంకేమున్నది?
అయితేఒకటి మా డిపార్టిమెంటు పాడయినది. లంచాలు బలిసేయి.
మొన్నకేసరివచ్చినాతో సిగ్గులేక ఒకసంచి యిస్తావనిచెప్పినాడు.

నాకుసిగ్గేసింది అయితే డబ్బులేదా! ఇప్పుడే వృద్ధిలోకివస్తున్నాను.
ఎందుకని యూరకున్నాను. అదిగాక అందరు స్నేహితులు. వాళ్లుమాత్రం
యిప్పుడీలాగు పడియున్నారు. ఈ పనికాస్తా అయితే రేపు బోనెక్కితే
మాపనిబాజా పట్టిస్తారు. మర్యాదాఆలోచించరు. అన్నిచండాలపు కూతి
లుకూయించుతారు- వాటికి తిన్నగా సమాధానం చెప్పలేకపోతే గెంతి
స్తారు. చిన్నతనం మాటలంటారు. బాబూ! మేమే అనుకుంటే మాకంటే
టక్కరిజాతి అయింది యీ ప్లీడరుజాతి! రోషంలేదు. సిగ్గులేదు. లజ్జలేదు.
అభిమానం లేదు. మొఖమాటం లేదు. ఏమో ఒక శెక్కడైనా యుంటే
యుండవచ్చును. మరీ యీఅండుకో ముఠాయెంతకైనా సిద్ధమైనారు.
ఏలా! వీరందరు నాస్నేహితులు. ముందు డబ్బు చేతిలో పడితేనేకాని
కాగితం తెరవరే! లాకాలేజివదులుతారు. పార్టీమొఖం చూస్తారు డబ్బు
జేబులో ఒకటి రెండు సారులు వేస్తారు. తరువాత మన శకం కాదుగా
ఆవృత్తిచిత్రం! నాయనో! బోగందానితోనైనా మాటలాడి దానిని టోపి

వెయ్యావచ్చునుగాని యీ కాలపు ప్లీడర్లతో మాటలాడలేము తండ్రో! నా కర్మ_ర్తిచేత యీపాడు డిపార్టిమెంటులోకి దిగినాను. నావంటివాడు చేయతగ్గది కాదు. దయదాక్షిణ్యములు, మానాభిమానములు, సిగ్గుభిడియములేని మొరటువాళ్లు చేయవలసినపని యీ పని న్యూ_లుమేష్టరు చేదాం అని అనుకున్నాను. దరిద్రం పాపిష్టిది! ఏమో జులుకుంగా మనుకున్నాను. ఛీ ఛీ పాడుడిపార్టిమెంటు! కగులుతే షరామేకు. నా కొంగుకు పాకు వెయ్యి అని చెప్పినాను." అని యాఖూబుసాహేబు తలపోయుచు, స్టేషనుకుపోయి, ౮16 నెంబరును పిలచి, సమనులందరకు చేరినవా అని కనుక్కొ_ని, రేపు మనమందరము కళింగంపోవలెనని చెప్పి యింటికి బైకుమీద పోయెను.

---

## 6 వ కల్పము.

## కళింగం-మేజస్ట్రీటుకోర్టు.

కామాక్షమ్మ, కొడుకు, దీక్షితులు, వెంకటపతి, రామిరెడ్డి, సబిన స్పెక్టరు, యాకూబుసాహేబు, ఇద్దరు కనిస్టేబుల్సు, సన్యాసిలింగం, అప్పయ్యశాస్త్రి, నరసింగం, విశ్వనాథం, కోర్టువారి సమనులమీద కళింగంచేరిరి. దుర్గాదాసు, రామశాస్త్రి, కేసరిశాస్త్రి, నాగేశ్వరరావు, వెంకటశాస్త్రి. యాయనభార్య పేరమ్మ, మరికొందరు స్నేహితులు లింగం తరఫున మద్దతుగా కళింగం వెళ్లిరి- భోజనాదులుసల్పి, సింగాచార్యులు, సుబ్రహ్మణ్యం, జామీనుదారులు కోర్టువారి యెదుటకువచ్చి, లింగాన్ని అప్పగించి వారిజామీనును గద్దుపరచుకొని పైనవత్తాసిగా యుండి పనిచేయుచుండిరి. మేజస్ట్రీటుగారు కేసుతీసినారు- మొదట కామాక్షిని పిలచినారు- ప్రాసిక్యూషను తరఫున జంబులింగం మొదలియారుగారు పనిచేసిరి- కామాక్షమ్మ బోనెక్కి_నది- ప్రమాణం చేయించిరి- "నా పెనిమిటికి, సన్యాసిలింగం, అయన తండ్రి వెంకటశాస్త్రి, కలసి నోటు వ్రాసియిచ్చిరి- తరువాత నాభర్త కాలగతినొందెను- తరువాత అనేక సారులు శాస్త్రితో చెప్పేదానిని, శాస్త్రి మా

యింట్లో పురాణకాలక్షేపము చేసేవాడు- నేను అడగడంచేత తర్చు మాయింటికివచ్చేవాడుకాడు- ఇటీవల బొత్తుగా రావడం మానివేసేడు- ఇదుగో, అదుగో, అని జరిపేవాడు- వాయిదా రేపుఅనగా నోటును నరసింగంప్లీడరు గారికి పంపెను- ఆరాత్రి సన్యాసిలింగం నాతావుకువచ్చి పైకం రేపు యిస్తానని చెప్పిపోయినాడు-లింగం వెంకటశాస్త్రికొడుకు-ఆలాగే మర్నాడుదయమున లింగం, అప్పయ్యశాస్త్రి కలసి మాయింటికి వచ్చేరు-శాస్త్రి నాప్లీడరు నరసింగం గుమాస్తా అంత లింగం చంకనున్న మూటతీసి, ముందు పెట్టుకొని, అమ్మగారూ! నోటు తెప్పించండి, ఇదుగో పైకం లెఖపెట్టించండి- అని అన్నాడు- అంతట శాస్త్రిని పిలచి నోటుతెచ్చినారా అని నేనుఅడిగినాను-మీయిష్టంలేనిదే తెస్తానాఅనిఅన్నాడుఅయితేతీసుకొనిరమ్మన్నాను- అంతటపోయికొంతసేపటికిలోనికివచ్చినోటునాచేతికిచ్చినాడు. ఏదమ్మానోటని శాస్త్రిగారూ పైకంయెంచండి. నోటు లెఖకట్టాలన్నాడు.ఏమోఅనుకొని నోటులింగం చేతికిచ్చినాను. ఇటుఅటు చూసేడు. ఏమోదగ్గినట్లునటించి వెనుకకు తిరిగి పెద్దదగ్గుదగ్గి కుడిచేతితో ముక్కుతుడుచుకున్నట్టు మూతికడ్డముపెట్టుకొని తిర్గిమావైపుకు తిరిగినాడు. నేనుమాటలాడించితిని. కొంతసేపు మాటలాడించితిని. కొంతసేపుమాటలాడలేదు. చేతితో సైగలు చేసేవాడు. ఏదో నమిలినట్లున్నది. మింగినాడు. గుటక కనపడినది. చేతిలో వేరకాగితంలేదు. నోటుమింగినాడని అనుకున్నాను. అప్పుడే దొంగ, దొంగ, మోసముచేసినాడు. నానోటుమాంతంగా మింగినాడని బిగ్గరగా కేకలువేసినాను. శాస్త్రిలేచినాడు. వెంటనే లింగం లేవలేదు! దొడ్డిదోవను వెంకటపతిగారు వచ్చినారు. వారినిచూచి లింగంకాలికి బుద్ధిచెప్పినాడు. వెంకటపతిగారికీ సంగతి చెప్పినాను. యెదుటనుండి రామిరెడ్డి వస్తూయున్నాడు పట్టుగో! పట్టుగో! దొంగ పారిపోతున్నాడు" అని అన్నాను.

బజారులో కలుసుకున్నానని రామిరెడ్డి చెప్పినాడు. రామిరెడ్డిలింగంతో తరువాత రనిమిషములకు మాయింటికి వచ్చినాడు. సంగతివారితోచెప్పినాను. రెడ్డిబైట నేయున్నాడు. లింగం లోనికి వచ్చినాడు. వెంకటపతియు

న్నాడు. నాకేం తెలియదని టలాయించినాడు. అంతలో మాఅన్న వచ్చినాడు. ప్రొద్దుట మాఅన్న మార్కెట్టుకు కూరలకుపోయేడు. ఆయనతో యీసంగతిచెప్పినాను. మాఅన్న వైద్యంచేస్తాడు. ఇంగ్లీషుమందులువాడుతాడు. తెనుగువైద్యంకూడాచేస్తాడు. నాకొడుకును చీటియిచ్చి పోలీసుస్టేషనుకు పంపినాను. నాకు చదువువచ్చును. నాకొడుకు 10యేండ్లవాడు. వెంకటపతిగారుమాయింటిపక్క యింట్లో కాపురంచేస్తున్నారు. ఆయనక్లీడరే ! నేనువారినిరమ్మనలేదు. నాకేకలువిని వచ్చినారను కున్నాను. తరువాతమందుగ్లాసులోపోసితాగమని యిచ్చినారు. వాంతిబోసినాడు. ఇంతలోపోలీసువారు వచ్చినారు. సబిన్స్పెక్టరుగారు యిద్దరు జవాన్లువచ్చినారు. వారితోయీసంగతిచెప్పినాను మళ్ళీనాయెదుట మందివ్వమన్నారు- తిరిగి దీక్షితులు మందు కలిపియిచ్చినారు. లింగం తాగినాడు. కొంచెం మొదట కక్కినాడు. తరువాత పెద్దకక్కుకక్కినాడు. అందులోవుండపడినది. అప్పుడే విప్పిచూచేరు. నేనుకూడా చూచినాను. నానోటే ! గుర్తుపట్టినాను. అక్కడక్కడే చినుగులున్నవి అంతాఅలికినట్లున్నది. తారీకువద్ద కన్నంపడ్డది. లోపలబాగా నేను చూడలేదు వెంకటపతిగారు బాగాపరీక్షపట్టిచూచినారు ఆకక్కు కాగితపువుండ ఒకగిన్నెలోనికి పట్టినారు జేడీలువేసి లింగాన్ని డాక్టరుగారి వద్దకు తీసుకొని వెళ్లినారు తరువాతనాకు సంగతి తెలియలేదు. వెంకటశాస్త్రి, మావైదికసాంప్రదాయమే, లింగధారులుకారు. బిడ్డలుకలిగి పోతూయుంటే వెకటశాస్త్రి తన కొడుకుని సన్యాసిలింగం అని పేరుపెట్టుకొని పిలిచేవాడు. ఈసంగతి పేరమ్మనాతో చెప్పేది. వారిల్లుమాయింటికిదగ్గరే ! సన్యాసిలింగం అంటే అర్థంలేనిపేరు. నాభర్తపోయి ఆరుమాసములైనది. వెంకటశాస్త్రికి జీతంగాకాదు కొంతనెలకు ముట్టచెప్పేదానిని పురాణం చెప్పేవాడు." అని చెప్పి బోనుదిగెను.

తరువాత కామాక్షికొడుకునుపిలిచిరి, పిల్లవాడు "సన్యాసిలింగాన్ని నేనెరుగుదును. మాయింటికప్పుడప్పుడువస్తూయుంటాడు. ఒకరోజుమాయింటికిప్పొద్దున్నవచ్చినాడు. సంచిముందుపెట్టుకున్నాడు. అదిరూపాయలసం

చిఅని అనుకున్నాను. నోటుమాఅమ్మ లింగంచేతికిచ్చినది, నేనుచూసినాను ఆరోజునయింట్లో నేయున్నాను. లాగుచొక్కాతొడుక్కున్నాను. ఇంతలో మాఅమ్మయేడవడం మొదలుపెట్టినది. తోచకబడికిపోలేదు. ఇంటినిండామనుష్యులువచ్చిరి. లింగం డోకడం చూచేను. ఏదో తెమడ, కాగితం డోకేడు. నాకుచదువురాదు. వుండగానున్నది-అక్షరములువచ్చును- పోలీసువారువచ్చేరు లింగాన్ని పట్టుకొనిపోయ్యేరు " అనిసాక్ష్యమిచ్చెను అటుతరువాత దీక్షితులు " లింగాన్ని యెరిక నేనప్పుడప్పుడు మాచెల్లెలుగారింటికిపోతాను. మందు నేనేయిచ్చేను. కాగితం వుండకక్కినాడు. కాగితం మింగటం నేను చూడలేదు. మార్కెట్టుకు వెళ్ళినాను. పోలీసువారు వచ్చినారు. నోటువిప్పిచూచినారు. అక్షరములన్నికలిసియున్నవి. రెండువేలని బాగా కనపడినది. అంతట పోలీసువారు లింగాన్ని స్టేషనుకు తీసుకొని వెళ్లినారు. నాకుయింగ్లీషు వైద్యం బాగాతెలియదు. కొంచెం ఆమందులు వాడుతాను. తెనుగుమందువాడుతాను. ఇపికాకుఅనేడోకుమందుయిచ్చినాను. రెండుసార్లుయిచ్చినాను. ఒకసారి తాగక పారపోసినాడు. కారణం తెలియదు. రెండవసారి పోలీసువారియెదట తాగినాడు. " అనిసాక్ష్యమిచ్చెను. పిమ్మట సబుయినస్పెక్టరు సాక్ష్యము " నేను కామాక్షమ్మగారి యింటికిపోతిని. నాతో యిద్దరు కనిస్టేబుల్సువచ్చియుండిరి. అంతకు ముందే వెంకటపతి, లింగం, దీక్షితులు, రామిరెడ్డి కూర్చునియున్నారు. నాయెదటడోకుమందిచ్చినారు. కాగితపువుండ కక్కినాడు. ఆకాగితం ప్రాంసరీనోటు- అందులో రెండువందల రూపాయలు అంకెబాగా కనుపడుచున్నది. కాదుకాదు రెండువేలు- లింగం దస్కతు అలికినట్లున్నది-తండ్రిదస్కతు బాగాకనుపడలేదు. అంతటజేడీలు వేసి స్టేషన్కు తీసుకొనివచ్చి,చార్జిచేసి పంపినాము." అనిచెప్పెను. తరువాత యిద్దరు కనిస్టేబుల్సు. డోకుచుండగా చూచినట్టుచెప్పిరి. అటుపిమ్మట వెంకటపతివచ్చినాడు. ఆయనసాక్ష్యం" నేనుకామాక్షమ్మ పక్క యింటిలోనుంటాను. నాదిప్లీడరివృత్తి. కామాక్షమ్మకు నాకుసంబంధంలేదు. ఇరుగుపొరుగువారము. ఏదోగల్లాభజరుగుచున్నది. అంటె నేనువారింటికివెళ్లినాను. దొడ్డిదోవను వెళ్లితిని. అదోవచాలాదగ్గర- దర్వాజానుండి

రామిరెడ్డివచ్చినాడు. రామిరెడ్డినాతో చెప్పలేదు. మరెవరో చెప్పినారు. పేరు జ్ఞాపకంలేదు. వెళ్లేటప్పటికి, తగువులాడుచుండిరి. కామాక్షమ్మ "నానోటుమింగినాడు. బాబూ, నన్ను దగాచేసినాడు." అనిలగాడాపెట్టుచున్నది. యీసంగతి నాతో చెప్పినది. యీలోగా లేచిపోయినాడు. లింగం ఎదురుగా రామిరెడ్డివస్తున్నాడు. రోడ్డుమీదకు లింగం వెళ్లినాడు. ఇంటిలో నాతో యీ వత్తుసంగతులుచెప్పినది- పోలీసువారికి కబురుచేయమని చెప్పినాను. వెంటనే చీటివ్రాసి నాకొడుకునుపంపింది. వెంటనేపోలీసువారు వచ్చిరి. యీలోపుగా రామిరెడ్డి లింగాన్ని చెయ్యిపట్టుకొని కామాక్షియింటికి తీసుకొని వచ్చినాడు. ఒకసారి డోకువచ్చినది. కక్కినట్లు నటించినాడు కాని తాగలేదు. గోడమీదపారబోసినాడు. ఇంటిలోపోలీసువారు వచ్చినారు. రెండవసారి డోకుమందుతాగినాడు కాగితంవుండ కక్కినాడు కాగితంనలిగిపడియున్నది. విప్పిచూచినాను. రెండు వేలు అనియున్నది. లింగందస్కతునుపోలికపట్టినాను. లింగందస్కతే అది. సంతకము బాగా కనుపడుట లేదు. తారీకు దగ్గర చక్కగానున్నది బహుశ దిద్దించియుండవచ్చును. అటువైపు తిరిగినప్పుడు లింగంచింపియుండవచ్చును. లింగానికి నాకువిరోధం లేదు, ఒకకేసులో యెదుటిప్లీడరును నేను. యెదుటిప్లీడరు విశ్వనాథం అంటే లింగం తరఫు ప్లీడరన్నమాట. పార్టీనుండి ఫీజుపుచ్చుకుంటాము గనుక పార్టీ తరఫుగట్టిగా పనిచేసేను, అంతేగాని లింగానికి నాకు యేవిధమైనవిరోధంలేదు. నేననోటు మింగడంచూడలేదు - కక్కినప్పుడు యెదురుగానే యున్నాను నాకేమియీకేసులో యింటరెస్టులేదు. పక్కింటివాడనైవునను, అన్యాయము జరుగుచున్నది కావునను, ఒకసిటిజనుయొక్క డ్యూటీకాన వెళ్ళియుంటిని, దస్కతులింగానిదే! నాకుబాగా తెలుసును. అంతటపోలీసు వారు లింగాన్ని స్టేషనుకుతీసుకొనిపోయిరి." అని వెంకటపతిచెప్పెను. తరువాత అప్పయ్య శాస్త్రి వచ్చినాడు. "నేనువుదయం కామాక్షియింటికిపోతిని లింగంనాతో రాలేదు. నాకాయన తరువాత కలిసేడు. అప్పుడుయెవరులేరు. ఎందుకువచ్చేనో నాకు తెలియదు - నోటునరసింగంగారికి పంపిందేమో నాకు తెలియదు. సాధారణంగానోటును లెక్కకట్టుటకు ప్లీడర్లు, గుమాస్తాల దగ్గరకు

తెలియదు. కామాక్షికి బాకీయున్నట్లులేదు. ఆమెభర్తకు లింగం తండ్రి బాకీఅనివిన్నాను. నిజంనాకు తెలియదు" అనిచెప్పి బోనుదిగెను.

తరువాత నరసింగం "నేను వకీలును. నోటు నావద్దకుపంపినది. దావాచేయమని చెప్పిపంపినది. లింగాన్ని నేనెరుగుదును. పెద్దమనిషి మరునాడుదయమున ప్లయింటువ్రాయించవలెనని అనుకున్నాను. ఇంతలో కామాక్షికొడుకువల్ల కబురుచేసింది. అంతనోటిచ్చిపంపినాను. తరువాత నోటునావద్దకురాలేదు. కొడుకును తీసుకొని గుమస్తావచ్చినాడు. పైనచెప్పినసంగతి నిజము. అందులో యేమున్నది నేనుచూడలేదు. ప్లయింటువ్రాయించుదామని పైకితీయుచున్నాను. ఇంతలో కబురువచ్చింది. పంపినాను. బాకీవారెవరో నాకుతెలియదు. లింగం బాకీయున్నాడని నాకుతెలియదు. లింగం నాతావుకు కొన్నికేసులుపంపేవాడు. దోస్తీకద్దు" అని చెప్పి బోనుదిగెను. విశ్వనాథం "నేను వకీలును. నాతావుకు లింగం వస్తాయుండాడు. అతను కేసులు నాతావుకు పంపుతాడు. వెంకటపతికి లింగానికి కొంచెం విరోధముకద్దు. వెనక యేదోకేసులో ప్రతికక్షిగాపనిచేసినాడు. లింగానికందులో సంబంధంకద్దు. ఆవిరోధం నాకు బాగాతెలుసును. సాధారణంగా కేసులలో ప్రతికక్షివహించినప్పుడు కేసు తీరుమానం అయినతోడనే మరచియుందుము. ఇది మావృత్తి. ఎవరు డబ్బిచ్చుక్రయిస్తే వారిపక్షంచేస్తాము. కాని వెంకటపతికా కేసులో సంబంధంగలదు. అందుచేత విరోధం, నేనొకపక్షం వకాల్తనామా పుచ్చుకున్నాను. నాకు వెంకటపతికి విరోధాలులేవు. లింగానికి నాకు బాంధవ్యంలేదు." అనిచెప్పి బోనుదిగెను. మేజిస్ట్రేటు "లింగం! నివేమిచెప్పుకుంటావు? నీమీద చార్జివిన్నావు కదా! నీకు సాక్షులున్నారా?" "నేను యీనేరం చెయ్యలేదు. నేను కామాక్షికి బాకీలేదు. నోటు మింగలేదు. ఇదంతా వెంకటపతి నామీదకల్పించినాడు. నాకు అతనికి విరోధం." అనెను లింగం అంతట న్యాయాధికారి ఈముద్దాయిని సెషన్సుకుకమిట్టు చేసినానని తీర్పుచెప్పి బెంచిదిగిరి. తీర్పువిని లింగాన్ని, బేడీలువేసి పోలీసువారు జైలుకు తీసుకొని పోయిరి. మేరీ! కేసు

జిల్లాకోర్టుకు పంపినారు. ఇంతవరకు బాగానే యున్నది. జడ్జిగారు ఏమిఅభిప్రాయం పడతారో చూడాలి. మొత్తానికి యాకూబుసాహెబు సాక్ష్యమంతా వెంకటపతిచేస్తే చెయ్యవచ్చుననే అనుమానం కలిగేటట్టుచేసేడు. ఇదంతా కేసరిశాస్త్రి, విశ్వనాథం అల్లిన పతకంసుమా! ముందువినుము.

## 7వ కల్పము.

లింగం తరఫున శ్రీనివాసరావుగారు జడ్జిగారివద్దకుపోయి, మరి 10 వేలకు జామీనిప్పించి విడుదలచేయించి లింగాన్ని యింటికి తీసుకొని పోయిరి. పాపం! లింగంతండ్రి వెంకటశాస్త్రికి నిద్రలేదు. ఆహారంలేదు. మతిస్థిమితంలేదు. పెద్దవాడు. కొడుకును యేలాగైనా తప్పించాలని విశ్వనాథంవద్దకుపోయినాడు. ఆయనలో తలపట్టుపట్టేడు. మనసు కుదిరికలేదు. ఏమితోచదు. స్నానంలేదు. సంధ్యలేదు. తపంలేదు. జపంలేదు. అన్నిమానుకున్నాడు. అందరికాళ్లు పట్టుకుంటున్నాడు. ఎవరేంచేస్తారు? చేసినది దుర్మార్గం. కండకావరంచేత యీపనిలింగంచేసేడు దీనికాలోచన యాదికాదన్నాడు. హైకోర్టుకు దుర్గాదాసును తీసుకొనిపోయేడు. అబ్బా! దుర్గాదాసు పట్నం తిరగలేక చచ్చేడు కదా! అక్కడ బెంచిగుమాస్తా విష్ణుఅయ్యరును పట్టుకున్నారు. శాస్త్రి ఆయనకాళ్ళమీదపడ్డాడు. అయ్యరుగారికి దయదాక్షిణ్యాలున్న. డబ్బుముఖ్యం అయిదువందలు కట్నం చెల్లించేరు. సరే లెండి! మీరుకోరినట్లే "కల్లూరు"కు వేస్తానుపొండి అనిఅయ్యరుగారు సెలవిచ్చిరి. ఆజిల్లాలో విశ్వనాథం గారికి చాలాపరిచయంకద్దు. అక్కడ ప్రాసిక్యూటరు నాథానికి నిండాస్నేహితుడు. ఇలాంటిపన్నాగాల్లో విశ్వనాథం దిట్ట- కల్లూరులోప్రాసక్యూటరు వెంగలిరావు దోస్తీకనుక ఒకరోజుముందుగాపోయి, వెంగలిరావుతో విశ్వనాథంమాటాడి సంగతులుచెప్పి రెండు వేలువొళ్ళోపోసేడు. అదిగాక ఉంగుటూరునుండి బోగం కాయకంటి కాంతాన్ని వెంట పెట్టుకొని వెంగలిరావుకతుకుపాటుచేసేడు-ఆకాయకన్నుతప్ప రంభవలెనుండును. పగలువెంగలిరావును చూడనిచ్చేవారుకారు. కల్లూరు

ట్రావిలింగు బంగాళాలోయుంచేది. రాత్రివెన్నెలవో పడక. డాబామీద యేర్పాటు- నిత్యం వెంగళిరావు రాత్రిపోవటం, ఉదయం రావటం. ఇదికంజాయింపు. యీకంజాయింపులో పడ్డాడు- వెంగళిరావు. ఈవిధంగానాథం, రావునువళ్లో వేసుకున్నాడు. కొన్నాళ్లుండి యిద్దరు ఊంగుటూరుచేరినారు కానిపాపం' రావునిత్యంకల్లూరునుండి కాంతానికి వుత్తరంవ్రాసేవాడు-వాయిదా రానియ్యండి. వస్తాను. ఇప్పుడువస్తే బాగుండదని జబాబువ్రాసేది. ఈలోగా వాయిదావచ్చింది. దుర్గాదాసు, కేసరిశాస్త్రి మూడురోజులు ముందుగా, కల్లూరుపోయిరి. కల్లూరుజడ్జి చాలామెతకమనిషి. శిక్ష విధించడంలో వెనకాడుతాడు. లంచంపుట్టుకు పుచ్చుకోడు. శిపార్సులుపడతాడు. సిపార్సులు పట్టడం, లంచంపుచ్చుకోవడంకన్న, యెక్కువైనగొంతుకోత! మైసూర్‌లో కాశిభొట్ల శివావధానిగార్ని పట్టినారు. వెంకటశాస్త్రిప్రత్యేకంమైసూరిందుకై పోయినాడు. జడ్జికి సిఫార్సుతెచ్చినాడు. ఇదిడైనకట్టుగాకాదు.

కల్లూరులో పురాణంచెప్పే రఘూత్తమ శాస్త్రియొకరుకలరు. ఆఅవధానిగారికి యీ,స్త్రీగారికి నిండా పరిచయం, కొంచెం బంధుత్వంకూడా కలదు. అవధానిగారు చేవుత్తరంవ్రాసి వెంకటశాస్త్రికిచ్చి, "మీరీవుత్తరం రఘూత్తమ శాస్త్రిగారి కివ్వండి. మీకాయన యావత్తు పనులుచేయును. పొండి," అనిచెప్పి పంపెను. ఈఅవధాని మైసూరు సంస్థానంలో ప్రధాన మంత్రి- అందుచేత యీసిపార్సు పట్టింది. చూచేవా మేరీ! లింగంయెన్నితిప్పలుపడుతున్నాడో! మొదటేవాళ్ళు యెందుకనిఅంటే చూడునాదెబ్బ! అని యెగరడంచేతకదా! యీఅవస్థ! ,,ఎవరుకనుక్కుంటారు. ఇలాంటివెన్నో నాచేతి మీదవెళ్ళిపోయినాయి!ఇదిలెఖా," అన్నాడుస్నేహితులతోలింగం. ఇప్పుడుచూడుయీబాధ! రఘోత్తమశాస్త్రిగారు నిత్యంకల్లూరులోజడ్జిగారి ఇంట్లో పురాణంచెపుతారు. శాస్త్రిగారి మాటయందు జడ్జిగారికి నిండాగౌరవము. అందుచేత వెంకటశాస్త్రి తనకొమారుని కోడలను శాస్త్రిగారి కాళ్ళముందట పడవైచి "మీరిందులో మమ్ములబ్రతికించాలి, లేకపోతే

యీతుంగభద్రలో పడిచస్తాము. ఈఅపవాదుకు బతకలేము.మామీదవిరోధంచేత వెంకటపతి యీకథంతాఅల్లేడు. చూ సేరా మావాడట కామాక్షికిబాకీయట ఆనోటునట తారీఖుచించి మింగేడట! ఇందులో అంతావెంకటపతిసాక్షంమీద యున్నది.అదిలేకపోతేయేమీ లేదు. అంతా అభూతకల్పనగానిమరొక్కటికాదు. తమరిందులో సాయంచెయ్యాలి. తమజిల్లాజడ్జిగారి కిదిపడ్డాది-యెల్లుండివాయిదా-ఈపుణ్యంమీది-మీకొడుకుగాభావించండి" అనికేసంతయుచెప్పి చేతికివుత్తరమిచ్చెను. వారివల్లవాగ్దానముతీసుకొని శాస్త్రిపోయెడు. కేసరిశాస్త్రి కోర్టుకుపోయి "ఎససర్లు" యెవరైనది కనుక్కొని పూర్తిగా వారిమనసులితిప్పేసేడు- అందులోఒకాయన తెలివిగాపనిచేసుడు వీళ్ళవ్యూహంలో పడలేదు. వాయిదావచ్చింది- అంతా కల్లూరుపోయేరు. వాయిదానాటి క్రిందటిరోజు రాత్రి రఘూత్తమశాస్త్రి జడ్జిగారితో కేసంతయువిప్పిచెప్పెను. అంతయువెంకటపతే కారకుడు తప్ప మరివకటికాదని పూర్ణముగాబోధించెను.

మరునాడు జడ్జి కమలలోచనరావు సీటుమీదకు వచ్చెను. వెంగలిరావుకేసు, స్వభావమును కోర్టువారికి, సభ్యులకు విప్పిచెప్పుచుండెను. మధ్యజడ్జిగారు "ఏమి అలాచెప్పుచున్నారు. కేసుబాగాచదివినారా? అది అటులగాదు. జాగ్రత్తగామాటలాడండి పూర్తిగాబోధచేసుకున్నట్లులేదే?" అనిచెప్పి కొంచెముకోపరసముద్రావిమత్తెక్కి వినుచుండెను. తాగినవారెప్పుడే సరళితో మాట్లాడదురుగదా! అంత వెంగలిరావు మంచిసమయము దొరకినదని యేవోనాల్గుమాటలతో తనకేసును పూర్తిచేసెను. బారిస్టరుగారు లేచి యేవో చలోక్తిగా నాలుగుమాట్లాడిరి.అంతటఒకరివెంబడియొకరిని పిలువప్రారంభించిరి. అందరిసాక్షమైనది జడ్జిగారు హియరింగుచేయుమని న్యాయవాదులతో బల్కిరి. బారిస్టరుగారు "సభ్యులారా! ఒకరిపైనేరమున్నది, లేనిది, తేల్చుభారము మీపైనున్నది. ఇది సామాన్యమైనసంగతికాదు. సాక్ష్యముబట్టిచెప్పవలెను. సాక్ష్యములో నెవ్వరెవ్విధమునచెప్పిరో జాగ్రతగా చూడవలెను. లేకున్న ముద్దాయికి చాలానష్టమువచ్చును. తగుమనుష్యులారా!

మీ కేమైన సందేహమున్న యెడల ముద్దాయికే యుపయోగపడునట్లు చేయుట విధివాక్యము. మీకు పూర్ణముగా నితడే యీకార్యము చేసినాడని దృఢమైన అభిప్రాయము కలిగినా అప్పుడు శిక్షించుట న్యాయము. కాక యితను చేసినాడా లేదా? ఒకవేళ నేరు భాగమున జరుగవచ్చునని అణుమాత్రమైన సందేహమున్న యెడల ముద్దాయికి బెనిఫిట్ ఆఫ్ డౌటు చూపవలెను. ఇది న్యాయము.

ప్రస్తుతము కేసు హియారింగము. కేసులో బలమేమియు లేదు. ముఖ్యముగా యిందులో వెంకటపతి సాక్ష్యములో కేసంతయు నిమిడియున్నది. ఆయన సాక్ష్యమును నమ్మినట్లయిన ముద్దాయి నేరస్థుడు. ఆయన సాక్ష్యం నమ్మని యెడల ముద్దాయి నేరస్థుడు కాడని చెప్పవలసియుండును. అయితే యిందులో కామాక్షి తప్ప తక్కినవారెవరు కోటును మింగుచుండగా చూచినవారు లేరు. ఆమె యెందుల కిట్లు చెప్పినదో వెంకటపతి సాక్ష్యమును పట్టియున్నది. ఇదంతా వెంకటపతి బనాయించిన పనిగాని సరికట్టి కాదని వెంకటపతి సాక్ష్యంవల్ల తెలియును. లింగంగారు పెద్దపెద్దవారి స్నేహం చేసి చిరకాలంబట్టి చెట్టుక్రింద ప్లీడరీ చేస్తూ మాకంటె యెక్కువ అనుభవం గలవాడు. అట్టిపనులు చేస్తాడా అంటె సమ్మతమునకు వీలులేదు. లింగానికి వెంకటపతికి విరోధమని ప్రాసిక్యూషన్ తరఫు సాక్ష్యం విశ్వనాథంవల్ల పూర్ణముగా బోధకమే కదా! కనుక యిదంతా వెంకటపతి కుట్రవలన జరిగిన సంగతిగాని పరిపకటి కాదు. ఇందులో కామాక్షి అన్న సాక్ష్యం చూచినారా! ఆయన మాట "యిపికాకట" యిచ్చినాడట! లింగం కక్కేడట! లింగం యెందుకు పోతాడు? పోతే ఆ అవుషధం తాగుతాడా? దీక్షితులు యేమైనా డాక్టరా? విషం యిస్తే యింతేగదా! ఇదంతా సుద్దాబద్ధం, కల్పన. మీరు న్యాయమూర్తులు. కోర్టువారు బెనిఫిటు ఆఫ్ డౌటు ముద్దాయి కియ్యవలెనని ప్రార్థించుచున్నాను." అని కూర్చొనెను.

అంత వెంగళిరావు "మీరు యిందులో సాక్ష్యం విన్నారుగదా! ఈముద్దాయి యీ నేరము చేసినది, లేనిది, వెంకటపతి సాక్ష్యంవల్ల తేటపడగలదు.

వెంకటపతి సాక్ష్యం నమ్మిన యెడల, ముద్దాయి నేరస్థుడే! అయితే నమ్మ కుండా వుండుటకు వీలులేదు. కామాక్షికొడుకు సాక్ష్యం, కామాక్షి సాక్ష్యం, రామిరెడ్డి, పోలీసువారి సాక్ష్యం, వీరందరి సాక్ష్యంబట్టి చూచిన యెడల తప్పక యీ నేరము ముద్దాయి చేసినట్లున్నది." అని కేసు స్వభావము స్పష్టముగా చెప్పి కూర్చొనెను. తరువాత జడ్జిగారు యసిసర్లకు స్పష్టముగా కేసును చెప్పిరి. అందొకడు ముద్దాయి "గిల్టి" అనియు వేరొకడు గిల్టీ కాదనియు చెప్పిరి. జడ్జిగారు రేపు తీర్పుచెప్పెదనని చెప్పి కోర్టు విడచిరి మేకి! అందరు వారి వారి బసలకేగిరి.

## 8 వ కల్పము.

మేకి! సన్యాసిలింగం ముద్దాయి కోర్టువారియెదుట నిలుచుండిరి. పదకొండుగంటలకు జడ్జీగారు సీటుమీదికివచ్చి, తీర్పును చదివి, కేసులో డైరక్టు సాక్ష్యంబలం లేదు, విరోధం చేత వెంకటపతి యీవిధంగా కూర్చి చెప్పెననియు, వెంకటపతి సాక్ష్యంలో కూడా నమ్మతగ్గ అంశములు విస్తరించి లేవనియు, గాన యీ కేసు కొట్టి వేసినానని తీర్పుచెప్పి లేచిపోయెను.

సన్యాసిలింగం, కేసరిశాస్త్రి, రామశాస్త్రి, దుర్గాదాసు, ముద్దాయి వారు నిప్పుకప్పిన నిప్పులవలె బయల్పడక జడ్జిగారి వల్లనే పడ్డామని లోలోన తాము గొణుగుకొనుచు, అబ్బా! ఎక్కడి జడ్జండి. ఇలాంటి న్యాయమూర్తి లేడండి. కేసు మా చేతప్పటి కేసన్యాయము గ్రహించెను అబ్బా ఏమి తెలివండి! లేకపోతే మా యింటి అనోగతి తాము కావలసినదే! జడ్జి అంటే అతడే!" అని రామ శాస్త్రి పొగడుచును, "అబ్బా! మనకేసరిశాస్త్రి ఏమికష్టం చేసేనోయి! మీ కేం తెలుసు తోడన్నప్ప నాకు చాలివచ్చినది ప్రాణము! పట్నం తిండిలేక విసికితినిగదా! అన్నం నీళ్ళు వేళకు లేక ఏమి అల్లాడితినోయి! మన కేసరిశాస్త్రి పడ్డకష్టానికి, నేను చేసిన కృషికి, విశ్వనాథం, రామశాస్త్రి పడ్డిన పన్నుగడకు ఫలం సరిగ్గా యిదివచ్చినది. అందుచేత శ్రమలేదు" అనుచు బసకేగిరి. బసలో గార్దెను పార్టి విశేయమై ముచ్చటించిరి. ఆప్లాయకు కొండవొప్పరు.

మనసింగాచార్యులున్నాడుకదా ! ఆయనయింట్లోయిదియేర్పాటుచేదాం అయితే ఖర్చు 20 రూపాయలగునే! ఏందారి! సింగాచారి దమ్మిడీయివ్వడే అని శాస్త్రిబల్కు, " దీనికేమి ? ఇంతఖర్చుకాగా ఈబిసాదుపుట్టదా? కేసరిశాస్త్రి ! నీవద్ద సొమ్మునిలవున్నదికదా ! ఆసొమ్ములో రూ 20 మనసింగాచార్ల చేతికివ్వుము. అంతా ఆచార్లే యేర్పాటు చేస్తాడు. దానిలో మజాయుంది. వాడొకవింతమనిషి. కాస్సేపువాళ్ళమతాలో చేరుతాడు. మనలోనేయుండడు. ఇదిగోస్పచిక్కు. అందుకిందులో యిరికిస్తే వస్తాడు. మన వీడెపుడూ దెబ్బతీయడు. మనసాహరిరావు అందరిలో ముందు పాలకొడతాడు. అతనికితోడు వెంకటాచలం వెనకవద్దత్తు వాళ్ళిద్దరిని పిలవాలి. ఆమేతవేస్తేనేకాని కట్టుపాటుకారు. అదికాక మాఅగ్రహారీకులను పిలవాలి వాళ్లునిండాపనిచేసేరు " అనిలింగంచెప్పెను. అప్పుడందరు సరేఅంటే సరేఅనుకొనుచు, ఉంగటూరు చేరబోరిరి. ఉంగటూరులో విద్యార్థి సమాజంలో అందరు కలసిరి. సిగ్గులేక తానొకమనిషినని చెప్పదలచుకొని కాబోలు వెన్నువిరుచుకొనుచు, సమాజానికిలింగం, దుర్గాదాసుకలసి తనసహజగర్వాతిశయములు ముందునడువ, తనలోతానిత ఘనకార్యంచేసి, గెలిచితిననికాబోలు, నవ్వుకొనుచు, ఏమోరాచకార్యములు మాట్లాడుచు నడుచువారివలె, అభినయముతో తిన్నగావచ్చి, కూర్చొనెను. అంతసభలో నిశ్శబ్దమొకింత రాజ్యముచేసెను. కొందరు లేచిపోయిరి. కొందరుమొగమటు త్రిప్పికూర్చొనిరి. కొందరుమాటాడక పేపర్లుచదువుచుండిరి. కొంతసేపటికి సభలో గుసగుసలు బయలుదేరెను. పాపమొక్కరైన లింగంతో మాటాడువారు లేరైరి. ఇంతలో రామశాస్త్రివచ్చెను. లింగంలేచిరామశాస్త్రినితీసుకొని రహస్యాలోచనకై వెళ్లిపోయిరి. లింగానికొకింతతలవంపులాయెను. తరువాతకొంతకాలమునకుతావనుకున్నట్లు సింగాచారిగారింట్లో లింగంతనస్నేహిత బంధువర్గముతో విందారగించి సుఖించుచుండె. కాని దిగులు. ఎప్పుడ హైకోర్టుకు పోతుందో అనేభయమే! చివరకు హైకోర్టుకు కేసు అప్పీలుచేసిరి. అందరకు సమనులువచ్చినవి. కేసు జడ్జిలు చదివిరి. అందు

లోపిందు వొకడు కలడు. ఆయన పేరు ముత్తుసామి నాయుడు. రెండవజడ్జి రహీం తుల్లాసాహెబుగారు. నాయుడుగారికిందులో నిజంకనుక్కొనవలెనని సరదాపుట్టింది. అప్పుడు పోలీసుసూపరెండెంటుగా నున్న "బక్లి" దొరగారిని పిలిపించిరి. మీలోనుంచి "డిటెక్టివు" యెవరని ప్రశ్నించిరి. అప్పారావునాయుడు తెలివిగా పనిచేయునని చెప్పెను. ఈరోజు సాయంత్రం మాయింటికాయనను పంపుమని చెప్పెను. సరేయని బక్లిదొర శెలవు గైకొని యింటికేగెను. నిజముగా జడ్జి అంటే యితడే కదా!

అప్పారావునాయుడు సాయంత్రం సైకిలుమీద జడ్జిగారింటికేగెను. జడ్జిగారప్పుడే టీ పుచ్చుకొని యీజీకుర్చీలో కూర్చొని లింగం కేసు చూచుచుండిరి. మంచిసమయం కనిపెట్టివచ్చెనని నాయుడు సంతోషించి సెల్యూటు చేసి కూర్చొనెను. జడ్జి "నాయుడుగారూ! యీరోజు రాత్రి మెయిలులో మనము మారువేషముతో నుంగటూరు పోవలెను. గానభోజనంచేసి రైలు స్టేషనుకురండి నేను శుద్ధవైదిక వేషము వేసుకొని తలకు యెఱ్ఱనిజరీశాలువ చుట్టుకొని, కుండనములు ధరించి, విభూతిపిండికట్లు నుదటను బెట్టుకొని, చేత బుడ్డిచెంబు నొకదానిని బట్టుకొని, రుద్రాక్షలు దట్టముగా మెడలోవైచి చంకనొక గావంచామూట నిరికించి రొంట నస్యపుబుర్రదోపి, కుడిచేత తాటాకులకట్ట పట్టుకొని నోటనేదో బుక్కచదువుచు గేటువద్దనే కూర్చొని యుందును. ఉంగటూరులో విశ్వనాథం ప్లీడరుగారింట్లో నేను బసచేస్తాను. నీవు రేపు రాత్రి 10 గంటలప్రాంతమందు వారింటికి సందాకపళ్ళవాడి వేషము వేసుకొని వస్తివా? అన్నికూతలు విశ్వనాథంచేత కూయించుతాను. సరేనా" అనివెళ్ళిపోయెను. పట్నం రైలుస్టేషనుకు వచ్చి యిద్దరు అదేప్రకారం టిక్కెట్లు కొని మేలుబండిమీదపడి ఉంగటూరు మరునాటివుదయం 6 గంటలకుచేరిరి. జడ్జిగారు సరాసరిగా విశ్వనాథంగారిల్లెక్కడని వెతకుచు యింటికిచేరెను. ప్లీడరుగారు ముఖమార్జనకావించి, అప్పుడే రెండుకప్పులు కాఫీతాగి బైట పచారీచేయుచుండిరి. విశ్వనాథం శాస్త్రిగారిని చూచి బోలెడు పడినమస్కరించి లేచి, శాస్త్రిగారిని కుర్చీపై కూర్చొనబెట్టి కుశలప్రశ్నలనడుగ .. వొ

చ్చిరి. శాస్త్రిగారు పరమానందభరితులైనట్లునటించి, విశ్వనాథముగారూ! తమ పేరు చాలాదూరదేశము నుండి వినివచ్చినాము. ఈసంవత్సరము కాశీ వెళ్లి అక్కడ గంగాతీరంలో గొప్పయజ్ఞంచేసి వచ్చినాము. అయితే నేనువచ్చినపని గోదావరితీరంలో ఒకయాగం తలపెట్టివచ్చినాను. మీసహాయం దొరుకునని వినివచ్చినాను. ఈకాలంలో మీలాంటివారులేకుంటే యేలాయీబ్రాహ్మణవృత్తి వుండడం? యీకార్యాలు జరగడం? మొన్న మీగ్రామములో ఎవరో శాస్త్రిగారు యజ్ఞంచేసేరట. అందులో మీరు పూరాసహాయం చేసేరట. అనిపలికెను అంతే "నాథంయిట్లనెను."

"స్వామీ! ఇప్పుడేగదా వచ్చినారు. సరే! దానికేమి, మాయింట్లో బ్రాహ్మణుడు వండును. నేను త్వరగా కోర్టుకు పోవలెను. స్నానంకానియ్యండి" అని చెప్పి విశ్వనాథం కచేరీచావడిలోనికి వచ్చి కేసులుచూచుకొని, స్నానమునకు లేచెను. సోమయాజులుగారు భావిదగ్గర కొల్లాయిగుడ్డ నుతికి, చీనాపట్టును తడిపి, స్నానమాచరించి, చీనాపట్టు పీతాంబరమునుగాలికిబట్టి యెండిన తరువాత పంజులుపెట్టి కట్టుకొని, యేదో గొణుగుచు తన దేవతార్చనపెట్టెను విప్పిసాలిగ్రామములు కడిగి, కొంత తీర్థము పుచ్చుకొని పూజించిపెట్టె కట్టెను. అవుసరనైవేద్యము పెట్టెను. అంతె వడ్డనజరిగినది. ఆత్మనివేదనముగావించి భోజనమారగించిరి. చేతులు కడుగుకొని తాంబూలమువేయుచు నిట్లు ప్రసంగించిరి.

"సోమయాజులుగారు! మీలాంటిపుణ్యాత్ములు మాలాంటిపాపాత్ములయింటికి వచ్చెదరా! ఏదో మాపూర్వజన్మసుకృతమువలన యిలా తటస్థపడేదరు." నాథం పల్కెను.

"అలాగనకండి మీరు పుణ్యవంతులుగాననే మాలాంటివారిచేత పుణ్యకార్యములు చేయించుతారు. అమ్మమ్మా! యెంతమాట!" అమ్మా! రాత్రి భోజనానంతరము మాటలాడుదము. కోర్టువేళైనది పోవలెను. అని చెప్పి పోయెను. రాత్రి భోజనానంతరం, విశ్వనాథం, సోమయాజులుగారు తాంబూలములు వేసికొనుచు, నిట్లు మాటలాడ దొడంగిరి. సోమయాజులు

గారు " యజ్ఞమంటే నిండుగా రంభాసంభోగమునకు కాదండి! స్వర్గము చూచితీరవలెను." అని అంత విశ్వనాథం "అవునండి మొన్న మాగ్రామం లో జరిగింది. అబ్బా! ఆహారోనములుచూచి తీరవలెను. సరేలెండి గాని కేమి! తమకు ప్రాక్టీసు బాగాయున్నదా? తమకు రాబడియెంత? అన నాకు నాల్గువందలండి నెలకు నాకంటే యింకావున్నారు. "ఉంటేనేం లెండి. మీకంటిగుణం వుండవద్దండి." అనగా నింతలో ఆమూలనుండి "చింపిరిగుడ్డలు కట్టుకొని, కాలునకొక కట్టుకట్టుకొని, "మాఘోరకరశీం, బాబూ, సందాకవశీమమ్మా!" అనుచు కేకలిడుకొని విశ్వనాథం యింటిన ద్దకువచ్చి నిలచి, ఒక " అరచుచుండెను. ఇంటిలో పరితీరిక లేదురా! అన వకు అంత నాయుకు గోడకు చేరబడెను. అని విశ్వనాథం చెప్ప, అయితే బా బూకొంచెం వుంటాడని చెప్పి విశ్వనాథం "అయ్యా సోమయాజులు గారు కాలం యెంతో చిత్రంగా యున్నదం డీ న్యాయం అన్యాయంగాను, అన్యాయం న్యాయంగాను, పరిణమించుచున్న దండి దీనికి కారణంచెప్పండి చూతాము?" అని "కాలంకలికాలంకదా! ప్రజలలో దురాచారములు బలసినవండి. మావాడొకడైనా శాస్త్రం లో చెప్పినట్లు నడిచేవాడు లేడుకదా! అందుచేతనే యీయనర్థాలు! మీ రుచెప్పినమాటనిజం. అంతేగాదం. విశ్వ "ఏమిటోనండి! యీకాలానికి ఆకాలపు ఆచారాలు పనికిరావు ఏవైనా యీకాలానికి తగినట్లు ఇప్పుడు మనమంతా ఆలోచించాలి. మొన్న చూసేరా! మావాడే! అంటే మాశాఖే! పొగపాటున పొరపాటేమిటిలెండి! చెయ్యాలనిచేసిందే! ఈ ప్రాణ్లో కామాక్షికి లింగం బాకీయున్నమాటనిజం. వాయిదాదగ్గరకువచ్చింది మెల్లగా ఆనోటును ఆమాంతంగా మింగేసేండి! కాలం ఏం చెప్పనున్నారు. అయితే యీజన్మ అంతటితో అంతరించవచ్చునను మేమంతా పద్దుచేసి తప్పించేము! ఆజట్టి యింతకు మాసిపొయ్యినమ్మినాను. అట్లాకొట్టేశాను ఈమాటమీలో నేయుంచండి సుమా! యెవరిక తెలియనియ్యకండి! ఏలామరి! కష్టంవచ్చింది తీర్చాలా? నిజానికి వెంకటపతి చెప్పింది నిజం సుమండి!

అయితేనొకటి పోలీసు సహాయంచేత అంతా వెంకటపతిమీదకల్పనబాగా కుదిరింది. అందుచేత యీకథ యీలాగే జడ్జికి చెప్పించి పనిచేసినాము. అక్కడ రఘూత్తమశాస్త్రిగారిని తమరెప్పుడయినా చూచినారా! "నేనెప్పుడు ఎవరివద్దకు పోలేదండి. మీరుయిలాంటివాళ్లో సహాయంచేసే వారని వినివచ్చినాను. పోలీసుబాబూ! పోనీయ్యండి! ప్రాణంకాచేరు నాయనా! యీకాలంలో ఎవరు యిలాతోడ్పడిరక్షించేవారునిజానికి? పాపం చిరాయువుగా బ్రతకనియ్యండి! యజ్ఞేసుని దయవల్ల తప్పిపోయినది. అయితే నాయనా? తరువాత యేమయినది? "తరువాత అబ్బా! ఎంతడబ్బు చల్లేదండి! షుమారు 10వేలండి! అయితే గెలిచేముగనుక మాకంతగా లేదండి! ఇంతలో యినస్పెక్టరు, వెంగళిరావుమాకు పూర్ణముగా సహాయంచేసినారు. లేకపోతేయీకేసు గెలవడంయేమిటండి? అయితే మీరురేపుంటారా? రేపు వేరేవూరు వెళ్ళవలెను. యీరాత్రి బండిమీద పోతాను" అంటె పెట్టెలోని నూరురూపాయలనోటు తీసియిచ్చివంపెను. ఈసంగతులన్నియు అప్పారావునాయుడు మధూకరము వానివేషము వేసుకొని, తనడైరిలో వ్రాసుకొనియుండెను. అంతట వారు సంభాషణ చాలించగనే అప్పారావునాయుడుమరునాడుండి రాత్రియథాప్రకారముగా సన్యాసిలింగంగారియింటికేగెను "బాబూమాధూకరవలెనండి!" అని అరచుచుండెను. అక్కడరామశాస్త్రి దుర్గాదాసు సన్యాసిలింగం మున్నగువారు అరుగులపై కూర్చొని మాటలాడుచుండిరి. "ఓరీ! ఎందుకరుస్తావురా! యింకాభోజనాలు కాలేదు. కాస్సేపుండిరా" అని వారిసంభాషణలో మునిగియుండిరి. వేషధారి ఆపక్కనే నక్కియుండి సంభాషణ యావత్తువినుచుండెను. లింగం "ఓరీ! శాస్త్రి! దెబ్బంటే మనదేసుమా! నోటును మింగనూమింగేను.తిర్గితప్పించుకున్నాను! ధైర్యం అంటేనాదేధైర్యం. ఏమికోర్టులురా! నిజంకనుక్కోలేరుగదా! మొత్తానికి శిపార్సుసుమా యింతపనిచేసింది. అనియేమోప్రగల్భాలు గొట్టుచుండెను. ఈసంగతులన్ని అప్పారావునాయుడు నోటు చేస్తూనేయున్నాడు. కొంతసేపయినతరువాత అందరులేచి వారివారిండ్లకు పోయిరి.

వాయుకు పట్నం చేరుకున్నాడు. జడ్జిగారా నాడే రాత్రి బయలుదేరి పట్నంచేరిరి.

వాయిదా నాటికి రావలెనని విశ్వనాథంకు సమను ప్రత్యేకంగా చేయబడినది. అందరుకలసి వాయిదా నాటికి పట్నంపోయినారు.

## 9 వ కల్పము.

పట్నం హైకోర్టులో లింగంబోనులో నిల్చున్నాడు. ఇద్దరు జడ్జీలు సీటుపైకివచ్చిరి. విశ్వనాథం బోనెక్కెను "గుడ్మేను" కేసునువిప్పిచెప్పి, తప్పక యీ నేరమీముద్దాయి చేసినాడనుటకు సందేహములేదు. కానతప్పక శిక్షవిధించుటయే కోర్టువారికి విధి. ఇందులో వెంకటపతిసాక్షం మిక్కిలి ఘనమైనసాక్షం. అయితే తక్కినసాక్షులవలన వెంకటపతియే యీ బనాయింపుచేసినాడని కిందకోర్టువారు చెప్పిరికాని అదిచాలాపొరపాటు. ఇందులో వెంకటపతికి లాభమేమియులేదు. వెంకటపతికి లింగానికి విరోధమున్నటుల సరియైన సాక్షములేదు. విశ్వనాథం యిక్కడకే వచ్చినాడుకదా! తమరుయిప్పుడు విచారించవచ్చును. ఇంతేసంగతుల"ని చెప్పికూర్చొనెను. లింగంవకీలు యేవోనాలుగుచెప్పెను. కాని జడ్జి "విశ్వనాథంగారిని కొన్ని ప్రశ్నలు వేశిరి. వాటితరువాత ముత్తుసామిగారు "ఏమయ్యా! మీయింటికి నడుమ ఒకసోమయాజులుగారు రాలేదా?" కొంతతటపటాయించి, ఆలోచించి వచ్చేడండి అని చెప్పెను "ఆయన ఎందునిమిత్తమువచ్చినాడు?" "యజ్ఞం చేస్తానన్నాడు. పైకంకోసంవచ్చేడు" ఏంయిచ్చినావు? వందరూపాయిలు యిచ్చినాను. నోటా? పైకమా? నోటె? నెంబరు జ్ఞాపకమున్నదా? ఆ! వున్నదండి. ఎంత? 120 అని జ్ఞాపకము. ఇదేనా ఆనోటు? దిగాలపడి, ముఖములో నెత్తురులేక కొయ్యవలె నిల్చుండెను. "మాటాడవేమయ్యా? భయంలేదు నిజంచెప్పు? అవునుయిదే! అయితే ఆశాస్త్రుల్గవారిని పోల్చిపట్టగల్గుదువా? చూస్తేపడతానండి. ఇక్కడున్నారా? లేరు. అయితే నేనుపోయిపంపుతాను. చూడుము అని జడ్జిలేచిపోయి, వెంటనేసరియయిన వేషముదాల్చి కర్రతోకుం

టుచు కోర్టులోనికివచ్చినిలచిరి. అంతసాహెబుగారు "ఏమండిచూచినారా? ఆయనేనా యీబ్రాహ్మణుడు? ఆ. అవునండి. బాగాచూడండి. సరిగాగుర్తుపట్టినారా? ఆ పట్టినాను. ఆయనతోనేమిచెప్పినారు? నేనా? ఏమిచెప్పినాను? ఏంచెప్పలేదే! అయ్యో! అయ్యో! ఏంచెప్పలేదే! నోటుతీసుకొని-నామీద తప్పుడు మాటలు చెప్పినాడా! బాబూ! అయ్యో! యీయననాకెంపతీసేదే! నాతోనేమీ చెప్పలేదు! నేమిచెప్పలేదు! అదికాదుచెప్పు? ఏమీచెప్పలేదు. ఏమిచెప్పలేదా? నిజమేనా? నిజమే! నాకేంతెలియదు. నిజంచెప్పు నీకుభయములేదు. లేకపోతే నీకొంపమునుగుతుంది. అయ్యానాకుతెలియదండి! వీడియింట్లకాపుగాను. వీడిపంక్తింగాను. అయ్యో! అయ్యో! ఏమోబ్రాహ్మణుడనుకున్నానే! ఇదేంపాపం! ఏంకొంపలుతుందోగదా! జడ్జిసాహెబగారు "అయితే నీవు, సోమయాజులుగారు మాటాడేటప్పుడు యెవరయినాయున్నారా? ఏమోనండి జ్ఞాపకంలేదు. మరెవ్వరులేరు సరిగా జ్ఞాపకంతెచ్చుకోండి? తొందరలేదు. పర్వాలేదు. "ఆ! అవును ఎవరో మాదాకపళ్లెం అబ్బివచ్చినాడు. ఇప్పటికి యింట్లోతీకలేదు అనిఅన్నాను. అప్పుడు ఆయనుఅరుగుకిందకూచున్నాడు. అంతే యెవరూలేరు." ఆవనిషిని పోల్చిపట్టగలరా? ఏమోచూస్తేపోల్చిపట్టగలను. ఆరోజు చీకటిరాత్రా? కాదు పిండారబోసినవెన్నెలే! అయితేచూడండి అదిగో! అక్కడనిలుచున్నాడు! ఆఅబ్బేనా? అంతాయిదేవేషం యిలనే. సోమయాజులుగారితో లింగంకేసు విషయమై మాట్లాడినారా? ఆఁ. మాట్లాడేనా? లేదండి. న్యాయంచేసేరు అంతేగాని మరివకటికాదండి. ఇంతేనేనుచెప్పింది! ఇంతేనండి! అయితేబోనుదిగండి. సోమయాజిబోనయెక్కెను. జడ్జి "అయ్యామీపేరేమి? నాపేరుముత్తుసామి. మీకేమిపని? నాకు యీకోర్టులో జడ్జిపని. ఈమాటన్నాడు విశ్వనాథం. గుండెలుబీటపారినవి. కాళ్లువణుకుచున్నాయి. పెదలు కంపమెత్తింది. అంగవస్త్రంజారింది. జడ్జి "అయ్యా! యిదేమిటితపరీవేషమువేసినారేమిటి? యీవేషముతో నేను, యీనడుమ ఉంగుటూరు వెళ్ళినాను. లింగంకేసులో నిజస్థితినికనిపెట్టవలెనని యుద్దేశంకలిగినది. అప్పుడు నాతో

విశ్వనాథం ప్రసంగవశమున, మే మందరము మద్దత్తు చేసి యీలింగా న్ని తప్పించినామనియు లింగం నిజంగా నోటు మింగినాడనియు అంతా మొన్న నే గ్రామంచేరి సుఖంగా యుంటిమనియు, చెప్పియున్నాడు. నాతో అప్పారావునాయుడు మధూకరమువానివేషము వేసుకొని గ్రామం లో తిరుగుచుండెను. ఆరాత్రి నేనే విశ్వనాథంయింటికి రమ్మనమని చెప్పి నాను. అదేప్రకారం వచ్చినాడు, మాసంభాషణంతయు నాయుడుగారు డైరీలో వ్రాసినారు. వెన్నెలలో వ్రాసినారు. అని బోనుదిగి బైటనుపో ము లేక సీటుమీద జడ్జివేషము వేసుకొనివచ్చి కూర్చొనెను. అప్పారావు నాయుడు బోనుయెక్కెను. జడ్జి "మీరు ఉంగుటూరు వెళ్ళినారా? వెళ్ళి నాను. ఎవరితో? జడ్జి ముత్తుసామిగారితో? ఎందునిమిత్తం? లింగం కేసు లో నిజం కనుక్కొనుటకు. లింగంగారింటికి కూడా వెళ్లేరా? వెళ్ళితిని. విశ్వ నాథం యింటికద్ద జరిగిన సంగతులు చెప్పండి "మొన్న చూచేరా! మావాడే! అంటే మాశాఖే! స్వారసాటున, స్వాసాటేమిటీలెండి చెయ్యాలనిచేసిందే! ఈవూళ్లో కామాక్షికి లింగం బాకియున్నమాట నిజం. వాయిదాదగ్గరకు వచ్చింది. మెల్లగా ఆనోటును అమాంతంగా మింగేడండి- మేమంతా మద్ద తుచేసి తప్పించేము. ఆజడ్జియింటికు విపార్సునక్కేడు. అట్లాకొట్టేశాడు- నిజానికి వెంకటపతి చెప్పింది నిజంసుమండి" అని డైరితెరచి చదివెను. లింగం యింటికద్ద సమాచారంయేమి? లింగం అంటాడు "ఓరీ! శాస్త్రి! దెబ్బంటే యిందేసుమా! నోటు మింగనూ మింగేను తిరిగి తప్పించుకున్నా ను. వైద్యం అంటే నాదేవైద్యం! ఏమి కోర్టులురా నిజంకనుక్కొన లేవు కదా!"...అని డైరినుండి చదివెను. జడ్జిగారు, విశ్వనాథమును యిందుకే మ నెదవని ప్రశ్నించిరి. చిత్తం- సరేనండి నిజమండీ. బుద్ధితెలియక చేసేనండీ- క్షమించండి అని మిన్నకుండెను- లింగాన్ని చూచి నీ విప్పుడేమ నెదవని ముత్తుసామినాయుడుగారడెగిరి అయ్యా! ఇది ప్రథమతప్పు, మన్నించండి. నేనుచేసినమాట నిజము ఏదో బీదవాడిని. బీదతనము యిన్నిటికి మూలము. నిజం యేలినవారియెదు

టదాచితే దాగునా? తమరు సమర్థులని నమ్ముకట్టుకొని సభకు ప్రాణా
చారముపడి లేవకుండెను. అప్పుడు జడ్జి సాహేబుగారు "లెమ్ము, నీకు,
క్షమించి చాలాతక్కువ శిక్ష విధించినాము. ఒక సంవత్సరం కఠినకారాగారం
విధించినాము. అని బెంచిదిగి పోయిరి. లింగానికి బేడీలు వేసి తిన్నగా
ఆనాడే రైలునెక్కించి "రాయవేలూరు" పంపిరి. తన స్నేహితులు దిగా
లపడి యెక్కడి వారక్కడ నక్కిన పేనులవలె ఆరాత్రే బయలుదేరి
ఉంగుటూరు చేరబారిరి. న్యాయము కనిపెట్టుట యెంతకష్టమో చూచి
నావా! సుందరీ! "అబ్బా! యీలాగు మాదేశంలో కనిపెట్టలేరు. చాలా
చమత్కారంగా యున్నదే!" అని "మేరీ గర్లు" కృష్ణమూర్తితో బల్కె
ను. కృష్ణ "యీనడుమ యిలాంటి చిక్కులు, ఫోర్జరీలు తప్పుడుసాక్ష్యాలు
యిలాంటి దురాచారాలు బలిసేయి. ఒకచోట ఒకటికి రెండు, రెంటికి
మూడు మూటికి నాల్గు కోర్టులు బలమైనవి. అంతకన్నా పేచీలు పెరిగినవి.
ప్రజలలో నమ్మకము పోయింది. దుండగములు బలమైనవి. అప్రమాణములు,
అన్యాయములు, కూనీలు, హెచ్చుచున్నవి. నాచిన్నతనంలో యింతగా
లేవు. నీకు నమూనాకీ కేసు చెప్పేను. ఇలాంటివి నిత్యం లెఖలేను. పోకిరి
తనం బలిసింది. దేశంలో ఐకమత్యం చెడ్డది. అసలు చదువు అడుగంటింది
పొట్టపోసుకునే చదువు చదివి తగాదాలు పెంచుతున్నారు. ప్రజలు ఈ సెం
చేవాళ్లెవరని? ఇదుగో అటుయిటు కాని చదువు చదివి, కులగోత్రాలు చెప
కొట్టుచున్నారు. పోనీ! అందులోనైనా సమర్థులా అంటె అదీ సున్నే!.
పేసయివచ్చిన మర్నాడు చదివిన చదువు గాలికిపోవడం. జలుబుతీరడం
సొమ్ముపోవడం. అబద్ధపు పన్నాగాలు అసత్యాలు పిల్లిమీద యెలిక, యెలిక
మీద పిల్లిని యెక్కించడం ఇవి వీరిపాండిత్యాలు! ఏంచెప్పమన్నావు.
మేరీ! అక్కడ జైలులోపడి "లింగం" తాను చేసిన పనులు తలపోయు
చు, పశ్చాత్తాపం పొందుతాడేమో అని తలంచెదవేమో! చూడు! ఆయన
చేష్టలు చెపుతా విను. జైలులోకూడా తిట్లుమోసే టప్పుడుకూడా యీ
యన పాండిత్యమే బయిటపడాలని వాళ్లమీద సవాలీతోల్తూ అందులో

కొత్త నమూనాలు బెత్తాయించుతాడు. అక్కడ యీఆటలు సాగిరావు కదా! బెత్తంతీసుకొని ముడ్డిమీద గంతారు అక్కడా ఆ బోరవిరుపు, ఆ అసందర్భపుప్రసంగాలు, ఆవిషపునవ్వు, ఆవిరపనకొయ్యతనము యివన్ని అణిగేటట్టు పేడతట్టలు,మట్టితట్టలు మోయించేవాళ్లు. ఇంకాప్రాగరణిగిన దంటావేమో అదేలేదు.

## 10 వ కల్పము.

---

### రాయవెల్లూరు జైలుమహాలు శాంతిభవనము.

కారాగృహము శాంతిభవనమని చెప్పనొప్పను. మనశ్శాంతి బొందుటకు చక్కనినికేతనము. అందు సంసారాది యీతిబాధలుండవుగదా! తానిదివరకుచేసిన దుష్కర్మలదలంచి మనోతాపమునొంది చిత్తశాంతిని పొందనగునుకదా! అయ్యో! ఈనాడు తిండిలేదే! కట్టుకొనుటకు గుడ్డలేదే! పరుండుటకు చక్కని స్థలములేదే! అనేచింతయుండదుగదా! ముష్టివాల, జేళ్లకింద ముష్టిసజ్జనుగదా! కాలేక నొప్పికి తమందేగంజి, రాగులువిచారము లేక దొరకునుకదా! అప్పుడాచింతయేల! కష్టచింతలున్నంటవు దుస్సంగతులు లింగానికేతప్పినవో గనిరము. పాపము లింగడు ఉదయమునలేచి కాలకృత్యములు తీర్చుకొని [illegible] పనిపనికిపోవును. పేడపోగుచేసుకొని పశువులవద్దబాగుచేసి పిడకలుకొట్టిరెనగదకివచ్చును. అప్పటికి 10 గంటలగును. అప్పుడు చిప్పపట్టుకొని కూటికైపోవును. ముద్దమెక్కి గదికిచేరును. అరగంటయినవెనుక పిండివిసరుటకు తనస్నేహితులు కొందరు వచ్చెదరు. అందరుకలసి ఒకబస్తాజొన్నలు పిండివిసరెదరు. ఈపిండిరాత్రి రొట్టెకు. అప్పటికి 2 గంటలగును. మళ్లీతిండికిపోయిగంజిదాగివచ్చును. వెంటనే [illegible]తీసుకొని పేడకైపోవును. ఆపనిచేసి 5 గంటలకు ఆఫీసుకు పోయిహాజరు వేయించుకొనితనగదిలోనికిపోవును. అటుపైన 8 గంటలకు రొట్టెయిచ్చెదరు. అదితినినీళ్లుతాగిపండుకొనును. ఇదిదినచర్య. ఇంకా ఏలాగైనా వెంకటపతిగారికండ్లే తనకెరనని సూచింతు! నిరంగా తలయెత్తి యేలాతిరుగుతాము అనే చింతా మేలేదు! [illegible] జైలు [illegible]

పూర్ణముగా విలపించె నేని చిత్తము పరిశుద్ధత నొందదా! మనిషికట్టిపారేసు. దిండియా అయినాడు- వెనుకకువేయడు- అక్కడ పాపము విశ్వనాథం యింటికిపోయి నిలువునా కుప్పనకూలపడిపోయినాడు. కోర్టుకువెళ్లడం మానుకున్నాడు- హైకోర్టులో తీర్పువ్రాయడంలో ముత్తుసామి నాయుడుగారు యీ విశ్వనాథంపట్టా, పీకివేసినాడు- అప్పారావునాయుడుగారికి వెయ్యి రూపాయలు బహుమతియిచ్చుటకును కితాబునిచ్చుటకును, పైకి రికమండు చేసిఆలాయిప్పించినాడు- యాఖూబుసాహెబుగారిని సబుయినస్పెక్టరుపదవి లోనికి మార్చినారు- కమలలోచనరావుగారికాపదవి ఖాయపరచక తిరిగి శాకికాడసబుకోర్టుకు సబుజడ్జీగా దింపినారు- లింగం యింటివద్దసంగతి విన్నావా? పాపం వెంకటపతిని ప్రయోగంచేసి వెంకటశాస్త్రి చంపేడు- మరిపది దినాలకే, యీపాపకార్యం కొడుకు జైలులోపడడం యీసంగతులు వెంకటశాస్త్రి మనసునుపట్టి వనోజాడ్యంచేత చచ్చేడు- ఆహా! ఎవడికర్మ వాడినేకొట్టునుకదా! పెద్దపెద్దజీతాలుపుచ్చుకొని, పెద్దపెద్ద హోదాలో నున్నవారి సంగతివేరు! బచ్చాకానివారి సంగతివేరు- లోకంలో నిజానికి కూడా లేదు- అందులో యీకాలంలోబొత్తిగాలేదు- చూస్తున్నాను కదా! మీదేశంలోకూడా అంతేనా? మరీ యీ యింగిలిచదువు చదువుకున్నవాళ్లలో దుర్మార్గాలు బలిసేయి. వాళ్లనుండి పల్లెటూళ్లకు సాకేయి- మాదేశం యిప్పుడు మారిపోయింది- రకరకాల మనుషులుబయలుదేరుతున్నారు-"కొంపలు అంటుకుంటున్నాయిరా! మీపూర్వపు చదువు వదలకండర్రా! మీస్వభాష వృద్ధిచేసుకోండర్రా! మీకళలు, మీవృత్తులు, మీసేద్యం, మీచేతిపనులు, మీసత్యం, మీనడత, మీకట్టు, మీబొట్టు, మీజుట్టు, మీతపస్సు వృద్ధిలోకి తెండర్రా! మీబాగోగులు మీరుచూసుకోండి! మీది ఆదినుండి సంఘబలం- సంఘమే అన్నిధర్మాలు సర్దుకోవాలి- పరాధీనం వదలండి- వెర్రిలో పడకండి" అనియెన్ని చెప్పినా వింటేనా! దీనికితోడు పోకిరితనం బలిసింది- దీనివిషయమై యింకొక "కథ" చెప్తానులే! చాలారాత్రైనది పోదాము పద అనిపోయిరి- కథ కంచికెళ్లింది.

* ఓం శాంతిః శాంతిః శాంతిః. *

# 20 వ శతాబ్దకథావళి

## ఉద్దేశ్యములు.

(1) మత, సాంఘిక, రాజకీయనైతికాది వివిధవిషయములందు జనులెట్టిసాంప్రదాయములను, ఆచారములను, నియమములను, పట్టుదలలను, అలవడియుండిరో, ఆవిషయమై రాఁబోవు సంతతి వారికొకింత జ్ఞానము కలుగఁజేసి, మేల్కొలుపుటయే యీకథావళి సంకల్పము.

(2) విద్యార్థులలో బలసిన దుర్భ్యాసములు, వాని నివృత్తిమార్గములు బోధింపఁబడును.

(3) ఈకథావళికి కథలువ్రాసియిచ్చువారికి వందనశతంబులుతప్ప వేరొధన మియ్యఁజాలము. కథలవిషయమై కార్యదర్శిగారితో నుత్తర ప్రత్యుత్తరములు సల్పవలయును.

(4) సాలునకు ౧౨ కథలు వెలువడును. సాలునకు చందా రు ౧-౮-౦ చందా ప్రథమకథతో వి. పి. గా రాఁబట్టడమగును.

భట్టి-నరసింహారావు,
కార్యదర్శి,
గుంటూరు.

# SRI

# RATIMANMADHA NATAKAM.

## A DRAMA IN FIVE ACTS.

TRANSLATED INTO TELUGU

**From the Original Sanskrit**

OF

**SRI PANDITARAJA**

BY

**SATHYAVOLU KAMESWARA ROW**

TELUGU PANDIT

**KIRLAMPUDI SAMSTANAM.**

Second Edition.



PITHAPURAM.

Printed at Sri Vidwajjana Manoranjani Press.

1914.

*Price 10 Annas*

శ్రీ

# రతిమన్మథనాటకము.

ఇది

శ్రీపండితరాజప్రణీతమయిన

సంస్కృతనాటకమునుండి

కిర్లమపూడిసంస్థానమునందలి

తెలుఁగుపండితుఁడగు

సత్యవోలు కామేశ్వరరాయనిచేతఁ

దెలిఁగింపఁబడినది.

రెండవకూర్పు.

పిఠాపురము.

శ్రీవిద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపింపఁబడినది.

1914

దీనివెల 8 అణాలు.

# పీఠిక.

ఈగ్రంథము పండితరాట్టని ప్రసిద్ధినొందినట్టియు "రసగంగాధరము" "భామినీవిలాసము" మొదలగు పెక్కులు సరసములయిన గ్రంథములను రచించినట్టియు జగన్నాథకవిసార్వభౌమునిచే సంస్కృత భాషను రచియింపఁబడినది. ఇది శృంగారరసప్రధానమయినది. అయిదంకములుగలది. దీని కుపేంద్రనందనుఁ డగుమన్మథుఁడు కథానాయకుఁడు. అతఁడొకనాఁడు పురవీథినిబోవుచు, వేడుకకై తనమేడనుండి పురవైభవము చూచుచున్న రాగునికూఁతురగురతినిజూచి యా యందు మోహము నొందెను. మఱునాడు తన వేడుకచెలికాం నాలోచించి యామెను మఱల నందనోద్యానమునందుఁ జెలిమికత్తెలతోఁగూడఁ బువ్వులు కోసికొనుచుండఁగాఁజూచి వారితోఁ గొంచెము ప్రసంగించెను. పిమ్మట నిరువురకును నన్యోన్యానురాగ మతిశయించి మిక్కిలి విరహభారముచే వేగుచుండిరి. తరువాత నుపేంద్రునిచే నడిగింపఁబడి రతితల్లిదండ్రులగు ముదితారాగులు మన్మథునకామెనిచ్చి వివాహముసేయ నిశ్చయించిరి. ఇంతలో శూరపద్మాది రాక్షసులను జయించుటకుఁ గుమారస్వామి యుద్భవ మావశ్యకమని తలఁచి దేవేంద్రుఁడు మన్మథుని పార్వతీశ్వరులకుఁ బరస్పరసంబంధము కలుగునట్లు చేయవలసినదని పంపించెను. అట్లు మన్మథుఁడు వెళ్లి యాయీశ్వరునికిఁ బార్వతియం దనురాగము పుట్టించి యామెను పెండ్లియాడునట్లుచేసి కుమారస్వామి పుట్టువఱకును నచ్చటనే యుండెను. కొంతకాలమునకుఁ గుమారస్వామి పుట్టెను. ఆశుభవర్తమానమువిని యింద్రాదిదేవతలెల్లరు మహోత్సవము చేసికొనుచున్నప్పు డందఱు నయ్యుత్సవపుతొందరలో నుండఁగా మేడమీఁదనిద్దురవోవుచున్నరతిని శంబరాసురుఁ డెత్తుకొనిపోయెను. అట్లెత్తుకొనిపోవుచుండఁగా నామెయం దనుగ్రహము గలదియై పరదేవతయొక్క

చతుర్ధావరణదేవత యగుసర్వార్థసాధిక తనయోగమాహాత్మ్యమున రతిపోలికగా మాయావతి యనునొకజవ్వనిని నిర్మించి యెవ్వరికిం దెలియకుండ నాశంబరుని రథమందుండునట్లుచేసి రతిని తనయొద్ద నుంచుకొనెను. తరువాత మన్మథుఁ డమరావతికి వచ్చుచుండ మార్గమధ్యమందు రతి నెత్తుకొనిపోయినాఁడని తెలిసి యచ్చటనుండియే వానికడ్డముగావెళ్లి ప్రబలమయిన యుద్ధముచేసి తుదకు వానినిసంహరించి మాయావతినే రతియను బుద్ధితోఁ దనరథమందుంచుకొని రికిఁ దీసికొనివచ్చెను. ఇంతకుముందే యాసర్వార్థసాధిక రతిని కొనివచ్చి యామెతల్లిదండ్రులకావృత్తాంతమును చెప్పి యొప్పించెను. తరువాత మన్మథుఁడు నిజమయినరతి నింటియొద్దఁజూచి యబ్బురపడెను. కొంతసేపటికి నిక్కము వారివలనవిని సంతోషించెను. పిమ్మట నారతిమాయావతుల నిద్దఱినిగూడ మన్మథునికిచ్చి వివాహముచేసిరి. అను నీకథయే యిందు మిక్కిలి చక్కగా నుడివింపఁ జేయఁబడినది. ఈగ్రంథముస్తోపకులును, కిర్లంపూడిసంస్థానాధిపతులును నగుశ్రీరాజా యినుగంటి వెంకటరాజగోపాల బుచ్చితిమ్మయ్య ప్రభువువారి యాజ్ఞానుసారముగా నేను దెలిఁగించినాఁడను. వారే దీనినచ్చొత్తింపించిరి. ఇట్లు విద్యాభివృద్ధిని గోరుచుండువారికి సర్వేశ్వరుం డఖండాయురారోగ్యంబులు నితోధికవైభవంబునొసంగి రక్షించుఁగాక! ఇందు (ప్రస్తావనమాత్రి) యిప్పటికిఁ దగినట్లు కొంతవఱకు మార్పఁబడినది. మఱియు నక్కడక్కడఁ గొంచెపుమార్పులును జేయఁబడినవి. మఱియు నీరెండవకూర్పునందు పండితరాజ తవ నిరంకుశత్వమున బాగుగా మేరకుమించి వ్రాసినపట్టులనుండు రెండుమూడుపద్యములఁ దీసివైచి మఱికొన్నిటి నించుక సవరించితిమి.

సత్యవోలు కామేశ్వరరాయఁడు,

కిర్లంపూడి.

To

M. R. Ry

**Sree Rajah Inuganty Venkata Rajah Gopala Buchi Tammayya Bahadoor Garu,**

*ZAMINDAR OF KIRLAMPUDI.*

**GODAVERY DISTRICT.**

THIS BOOK

**Is most respectfully dedicated**

(*with permission*)

As a token of gratitude and esteem

BY

His humble servant

THE AUTHOR.

శ్రీపరమాత్మనేనమః.

ఇష్టాదేవతాప్రార్థనాదికము.

౩౦౯

శ్రీకరమై యశేషముని శేఖర నిర్మల మానసాతిసౌ
ఖ్యాకరమై ససంశయజనావళి చిత్తగతాస్తినాస్తిచ
ర్చాకరమై సమస్తభువనాళి మహాతరణిప్రచారనీ
రాకరమై యొసంగెడు నిరాకృతి తత్వమహత్వమెంచెదన్.

సీ. ఏమహేంద్రులు నిండుప్రేమతో వేతనం
బిప్పించి సరిగఁ బోషింపుచుండు
రేకృపాళురు మదాంధ్రీకృతగ్రంథంబు
లెలమితో నచ్చు వేయింపుచుండు
రేనృపాలురు కీర్తులెసఁగ నన్ శాల్వాదు
లిచ్చి పల్మఱు గారవింపుచుండు
రేనరేంద్రులు గ్రంథమేదేని రచియింపఁ
బ్రోత్సాహ మొనరింపుచుండు రట్టి

తే. గీ. భవ్య వేంకటరాజగోపాల బుచ్చి
తమ్మయాఖ్యాసముల్ల సద్ధరణినాథ,
రాజగోపాల వేంకటరాజచిన్న
రాయనామక మేదినీరమణులందు.

క. అలబుచ్చితమ్మయోర్విపుఁ
డెలమి నిడినయాజ్ఞమాళి నిడుకొనివేడ్కన్
బలుమారు సకలసుకవుల
కెలమిఁబ్రణామములొనర్చి యెంతయుఁబూన్కిన్.

ఉ. పండితరాజు సర్వకవి పార్వణరాజుల సద్రసంబులన్
నిండియొసంగవాగ్ఱిసెమును నిర్జరభాషనుబ్రౌఢసద్వచో
మండితమైచెలంగ రతిమన్మథనాటక మద్ది తెల్గునన్
నిండుమతిన్ రచింపుదుమనీషులుదోషములందొలంచుతన్.

# కవిపండితులయభిప్రాయములు.

## "శుక్తికంఠోపాఖ్యానము"

"స్వకపోలకల్పితముగా నిట్లు వ్రాయుట శ్లాఘ్యమే. కవనము మృదుమధుర ఘటితమై శ్రావ్యముగాను సుబోధముగాను నున్నదని చెప్పుటకు సంతసించుచున్నాను.

"చ. ఇనుఁడును నేను నీకుఁ దిలకింప సమంబుగఁ గన్నదోయిరై
తనరఁ దదాత్మనుండి యిటు ధర్మమె నాయెడ లేమి యంచు బల్
చనువున వేఁడి యెంతయుఁ బ్రసన్నుని జేసి హరిన్ ధరించెనో
తనువున సుప్రసిద్ధముగఁ దద్దయు నా నెలయొప్పెఁ గందుతోన్."

అను దీనికల్పన కెంతయు సంతసించితిని.

వడ్డాది సుబ్బారాయుడుగారు.
రాజమండ్రి.



"Originality గల గ్రంథములలో పింగళిసూరన్నగారి కళాపూర్ణోదయమును మీశుక్తికంఠోపాఖ్యానమును రెండు మాత్రమే యున్నవి.

కే. శివరామకృష్ణారావుగారు.
ఏలూరు.



"కవిత్వ మాంధ్రపదబహుళమై సంస్కృతపదములతో స్వల్పముగ మిశ్రమై శ్రావ్యమై యున్నది."

"కవిత్వమంతయుఁ బాదపూరణము మొదలయినవి లేక కమ్మచ్చునఁ దీగదీసినట్లు మృదులమై యౌచిత్యమును మీరక యొప్పుచున్నది."

"వర్ణనాంశము లతిబహుళములుగాక యథోచితముగ నున్నవి."

"శైలి నిర్దుష్టమయి యనాయాసకృతమై భావగభీరత గలిగి పింగళిసూరకవికవిత ననుకరింపుచున్నది."

" కళాపూర్ణోదయమందలి కథాకల్పనము ప్రభావతీప్రద్యుమ్నమునందలి కవిత్వవైఖమును దిఙ్మాత్రముగా నీగ్రంథమునందుఁ బ్రదర్శింపఁ బడినవి. "

" ఇట్టిసరసకవితాధురీణు లగు కవుల నాదరించినప్రభువులసారస్యము వెల్లడి యగుటయే గాక యాప్రభువులకు నిట్టికవులవలనను నిట్టిగ్రంథములవలనను ఖ్యాతి యాచంద్రార్కమై నిలిచి యుండును, "

మంజువాణి డిశంబరు. 1902

---

" మీ శ్రుతికంఠోపాఖ్యానమును జూచితిని.

చ చదివిన నీదు పద్యములె సారెకుఁ గోరిక లీరికెత్తఁగాఁ
జదువవలెం గవిత్వమున సొంపును దీపును జూపువారిలో
మొదల నినున్ గణింపవలె ముద్దులు తద్దయు గారఁగా రసా
స్పదపదగద్యపద్యముల వ్రాయువలంతి వలంతివే యిలన్. "

దేవగుప్త సన్యాసిరాజుగారు
గుంటూరునుండి.

---

" ఋతుసంహారము. "

" క. అతిమృదుమధురపదాఢ్యం
చితముగ నీ వాంధ్రకృతిగఁ జేయ సువిశదా
కృతి యా ఋతుసంహారసు
కృతి నామది సమ్మదంబు గీలించెఁ గడున్

క. చతురోక్తులును వరాం
కృతులును సద్వృత్తిరీతి మృదులపదాంచ
ద్గతులును గలిగిన ముగ్ధయు
వతికి నీకృతికి సరసపశ్యత యరుదా ? "

సుసర్ల చినసుబ్రహ్మణ్యశాస్త్రులవారు
బొబ్బిలి సంస్థానకవి.

“ శ్లో. సుకుమారపదసమేతా
కామేశ్వరవర్య! భారతీ భవతః
రమ్యాలంకారాఢ్యా
జయతిసువర్ణాంచితా చ సకలాప్యా॥ ”

శ్రీమద్దామెర చినవేంకట[illegible]గారు.

పాలతేరు.

“ గ్రంథము శైలియును చమత్కారమును మీ విశేషపాండిత్యమును శ్లాఘించు చున్నది. చూడఁ జూడ మధురరస ముప్పొంగుచున్నది. ”

దేవరాజు వేంకటరావుగారు.

సంగమవలస సంస్థానము. మృత్యుంజయనగరము.

## స్త్రీగుణాదర్శము.

“ గ్రంథ మెంతయుఁ జక్కఁగాఁ దెనిఁగింపఁబడినది. ప్రతియంశమును విడువక వ్రాయుటయే గాక టీకయందు వ్యక్తపరిచినప్రకారము సందర్భస్థలములయందేమి యావశ్యకమైనపట్టులనేమి కొన్ని విశేషాంశంబులుగూడఁ జక్కఁగాఁ జేర్పఁబడి పాఠకుల కత్యంతామోదంబును గలిగించుచున్నది. దీనిరచనవలన మీకు కలిగియున్న పాండిత్య మత్యంతశ్లాఘాపాత్రమై యిటువంటిమరికొన్ని గ్రంథములను రచింపుమని మిమ్ములను ప్రేరేపణ చేయుటకు సహకారియై యొప్పుచున్నది. ” గ్రంథమును జూచుటయందలి యానందమును వ్యక్తపరచువాక్యము లెంతవెదకినను గానరాకుండినందున మిన్నకుంటిమి. ”

శ్రీరాజా మృత్యుంజయనిశ్శంక బహద్దరుగారు.

సంగమవలససంస్థానాధిపతులు.

" అయ్యా! తాము నాపేర బంపినవిశ్వగుణాదర్శమును జూచి చాలా సంతసించినాను. " చూచినంతవరకు శ్లాఘనీయముగా నున్నది. "

గస్టవ్ ఆపర్టుదొరగారు.
మదరాసు.



## రతిమన్మథనాటకము.

" చ. మనుపన ముద్దుపల్కులకు ముఖ్యునిగా గణియింత్రు ముక్కుతి
మ్మన, మరి తేటతెల్గునకు మాన్యునిగా నలకూచిమంచితి
మ్మన, నిపు డేము నెమ్మి సకలాంశములన్ గణనీయుఁ డందు మీ
ఘను రతిమన్మథోదయకృతికర్తను కామముఖేశ్వరాహ్వయున్. "

శ్రీ మహామహోపాధ్యాయబిరుదాంకితు లగు మ॥రా॥రా॥
కొక్కొండ వేంకటరత్నము పంతులవారు.

" ఉ. తేనెలసోనలో కలకదేరిన వీరిన పానకంబులో
మానితమాధురీగుణసమంజసపాయసగోఘృతంబులో
నూనవితానసంజనితశుభ్రతరాభ్రఝరీమరందసం
తానములో సుధారసనిధానములో గద మీకవిత్వముల్. "

మరియు " మీగ్రంథమును జూచిననాఁడు పిండివంటలు తప్పనగాఁ దోఁచుచుండును. "

దేవగుప్తసన్యాసిరాజుగారు.
విజయనగరమునుండి.

ఇంకను పెక్కులు కలవుగాని గ్రంథవిస్తర మగునని విరమించితిమి.

శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

## ప్రస్తావన.

సాకూతంబుగ శంకరున్ సురనదిన్ సాసూయతన్ భక్తు న
స్తోకప్రేమను భృంగి లేనగవునన్ దోరంపు మేలూర్మి నా
శోకాస్త్రున్ రతికాంతనాదరణ నోలింగాంచు లోకాంబికా
లోకంబుల్ సిరులిచ్చి నిచ్చలును నేలుంగాత సభ్యాళులన్.

(నాందియైనతరువాత)

సూత్రధారుఁడు—(తెరవంకఁ జూచి) ఓసీ! ఇటురమ్మ.

నటి—అయ్యా! ఇదిగో! వచ్చితి నేమిసెలవు?

సూత్ర—ఓసీ! ఇప్పుడు మనమొక నాటకము నాడి యీపండితసభను సంతోషపెట్ట వలెను.

నటి—అయ్యా! ఏనాటకమును?

సూత్రి—ఓసీ! పండితరాజని పేరువడసిన జగన్నాథ మహాకవిచేఁ బూర్వము వేల్పు బాసను రచియింపఁబడి యిప్పుడు సత్యవోలుకామేశ్వరరాయనిచేఁ దెలిఁగింపఁ బడిన రతిమన్మథనాటకమును.

నటి—ఆర్యా! ఇంతకుముందే పెక్కండ్రు మహాకవులు తెలిఁగించినమంచిమంచినాటకము లింకను నెన్నో కలిగియుండఁగా మన మిప్పుడు దీనినే యెందుకాడవలెను?

సూత్ర—ఓసీ! అగును నిజమేకాని, యైనను.

ఆ. వె. చెలుల వింతవింత చిన్నెలు నానాఁట
గాంచఁగోరు వన్నెకాండ్రపగిది
నెపుడుఁ గననిక్రొత్తకృతులనె కనవేడ్క
నెనసియుందురుగాదె యెల్లజనులు?

మఱియు—

సీ. ఏమేటి యామేటి వామననాటకాదులువ్రాసి కీర్తి దిక్కులను నించె
నేజాణ తనకుఁ దానే వీణ వాయింపవేనేర్చి యందుఁ బ్రవీణుఁ డయ్యె
నేసూరి బాణుండువ్రాసినకాదంబరీ గ్రంథ మాంధ్రీకరించి మించె
నేదంట గ్రంథంబు లెంతో శ్రావ్యంబుగాఁ జదువ నిస్తులుఁడన్ప్రశంసనొందె
తే. గీ. నతఁ డతులధీయుతుం డేతదగ్రజుండు
సరససంగీతసాహిత్య సారవిదుఁడు
వరగుణాఢ్యుండు సోమసుందరకవీంద్రుఁ
డెలమి నందంద మెరుఁగులు దెలుపుచుండ.

ఉ. తేనెలసోనలట్లు కడుఁదీయగ నొప్పెడుతేటమాటలున్
జానలకైనను దెలియఁజాలెడుచక్కని ముద్దుపద్దెముల్
దా నిడి యీతఁడున్ గడుముదంబునఁ దెల్గొనరించెఁ గావునన్
దీనిని జూచి యిప్పటిసుధీతతి హాళిని దేలకుండునే?

నటి—అయ్యా! సరే; అట్లయిన మీరుసెలవిచ్చినది బాగుగా నున్నది. కాని, యెల్ల విద్దెలయందును మిక్కిలి నేర్పుకలిగి యలరుచున్న యీపండితుల నందఱను మన మెట్లు సంతోషపెట్టఁజాలుదుమో యని నేను మిక్కిలి సందేహించుచున్నాను.

సూ—ఓసీ! నీ వట్లు సందియము నొందనక్కఱలేదు. ఒరులయల్పగుణమునయినను గొండంతగాఁ జేసికొని గ్రహించుటయే యీలాంటి తెలివిగలవారికి స్వభావము. తక్కనవారియెడ నది తలక్రిందుగా నుండును.

తే. గీ. మబ్బుగమినుండి పడుచుండుమంచిధార
లైన నలకాటి నేలను నడఁగిపోవు
నొక్కచినుకైన రత్నమై యొనరి మిగుల
డంబుమీఱదె రత్నాకరంబునందు?

నటి—(సంతోష సంభ్రమములతో) అయ్యా! ఈలాటి మంచిసభ దొరకినప్పు డింకను జాలముచేయుచున్నా రేమి?

సూ—ఓసీ! లేదు. నీ విప్పు డీపూలకల్మిచే మిక్కిలి చక్కగా నొప్పుచున్న వసంతర్తువునే పూని గానముసేయ నారంభింపుము. ఇదిగో! ఇప్పుడు—

చ. చిలుకలపిల్ల లుద్భవము చెందుచునుండెను; గండుఁగోయిలల్
పలుమఱుఁబంచమధ్వనులఁ బాయక కోయనికూయుచుండెఁ; బ్రమాఁ

కుల గమి పూచెఁ; జందనపుఁగొండ సమీరము వీచుచుండె; నా
యలులకుఁ బండె నోములు; యువాళికిఁ గోర్కులు నిండె మెండుగన్.

నటి—అవును.

తే. గీ. సచివుఁ డైనట్టియిట్టివసంతునందుఁ
దనదు భరమెల్ల నుంచి కందర్పవిభుఁడు
సులభముగ ముజ్జగంబులఁ గెలుపుగొనుచుఁ
దనరుచుండెను రతిపరతంత్రుఁ డగుచు.

(ఇట్లు గానము చేయుచున్నది.)

సూ—(సంతోషముతో) ఓసీ! నీ వొనరించినగానము మంత్రియగువసంతునందుఁ దన రాజభారమంతయు నుంచి మన్మథుఁ డెడ తెగనిసుఖము నొందుచున్నాఁ డని యు, రాగునికూఁతురయిన రతియందుఁ గోరికకలిగియుండె ననియు నిరుదెఱఁగుల సూచించుచు మిక్కిలి చక్కగా నొప్పుచున్నది. కాఁబట్టి వేగముగాఁ దమతమ వేషములను బూని సిద్ధముగా నుండవలసిన దని శైలూషిజనముతోఁ జెప్పుము; నేనును మారిషుఁడును మన్మథనర్మసచివులవేషములను వేయుదుము.

నటి—చిత్తము.

(ఇద్దఱును వెళ్లుచున్నారు.)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

---

## ప్రథమాంకము.

మన్మథుఁడు—(పరిక్రమించి విదూషకునితోఁగూడ సింహాసనముమీఁదఁగూర్చుండి వేడుకతోఁ దనలో)

సీ. చంచలింపక బిట్టుచక్కనై కనుపట్టుమించుదీవ యనంగ మించుదాని
నిలిచి యాకసమ్మాని తిరుగనక్కఱలేనిచుక్కనా రుచులఁ జెంపెసఁగుదాని
మెత్తనై మెఱుఁగారు మేలిమిబంగారుబొమ్మబోల్ మేనియందమ్ముదాని
నల్లనల్లన నిప్పుడంకురింపుచు నొప్పు నలజవ్వనంపునీ టలరుదానిఁ
తే. గీ. గొల్లగా జెనుఁగుచూపుల నెల్లకడల,
నల్లగల్వలవలె వెదచల్లుదాని,
మేడపై నున్నయొక యన్నుమిన్నఁ గంటిఁ
గంటి కింపారఁ నిన్న మార్గంబులోన.

(అని పరవశమును నటించుచున్నాఁడు.)

విదూషకుఁడు—మిత్రుఁడా! పరమార్థసుఖ మనుభవించు చున్నవానివలె నొప్పుచు నిప్పుడు నీలోనీవే యేమో యనుకొనుచున్నట్టు కనఁబడుచున్నా వేమి?

మన్మ—(వినిపించుకొనక మరల నదియే యనుకొనుచున్నాఁడు.)

విదూ—(తనలో) అయ్యో! నామాట చెవిటివానిచెవిఁ బాట యయ్యెనే! (ప్రకాశముగాఁ జేతితోఁ గొట్టుచు) మిత్రుఁడా! నాపలు కడవిఁగాసిన వెన్నెలయే యయినదా!

మన్మ—(ఆలకించి) నెచ్చెలీ! ఏమనుచున్నావు?

విదూ—మిత్రుఁడా! నీ విప్పు డీలాగునఁ జింతించుచుండుటకుఁ గారణ మేమి?

మన్మ — నెచ్చెలీ! సాంఖ్యాయన! నీకునుఁ జెప్పఁగూడని దేమున్నది?

(చంచలింపక యనునది మరలఁ జదువుచున్నాఁడు.)

విదూ — (తనలో) దీనికి నే నొప్పుకొనినచో నీతఁడు నన్నె యాయాసపెట్టును. కాఁబట్టి యీలాగునఁ బూనుకొందును. (ప్రకాశముగా నాక్షేపించుచు) మిత్రుఁడా! ఎల్లలోకములకును మోహమును గలిగించుచుండు నీకుఁగూడ వలపు గొలుపఁజాలునొక చెలువ గలదని చెప్పెడిమాట నిక్కువమని నమ్మఁజాలకున్నాను.

మన్మ — నెచ్చెలీ! అట్లు గాదు—

చ. చెలువున మించి వింత లగుచిన్నెలచే జడదారిమిన్నచా
ల్వలవఁగఁ జేయఁజాలునవలాలు జగాలను నుందు గట్లుగా
దలయెలనాఁగ మన్మథుఁడ నై తగునాకును నొక్కమన్మథుం
గలుగఁగఁ జేసెఁ గన్గొననె, కల్కి నెవం డిటు సృష్టిఁ జేసెనో!

విదూ — మిత్రుఁడా! "తావలచినది తనకు రంభ" యని లోకోక్తియే యున్నది గాదా?

మన్మ — నెచ్చెలీ! నే నబద్ధమే చెప్పుచున్నా ననుకొనుచున్నావా యేమి?

విదూ — మిత్రమా! నీవు చెప్పినది నిక్కమే కావచ్చును; అయినను మేడపయినుండి పురవైభవమును జూచుచున్నప్పుడు, స్వభావముచేతనే యంతటను గలయఁ బర్వుచుండు నామె వెక్కుమాపులకు నిన్నె గురిఁజేసికొని యీలాగునఁ బరితపించుచున్నా వేమి?

మన్మ — మూర్ఖుఁడా! నన్నంతయనాగరికునిగాఁ దలఁచుచున్నావా యేమి?

ఉ. చక్కఁగఁ జూచె నింతి వెఱచక్కఁ గనుంగొనునన్ను; నేఁగన
న్మక్కువనొందఁ గన్మలిపె; నాబలుతేజివడిన్ షమీప, మే
గ్రక్కునఁ జెంద డాకెఁ జెలికత్తెపిఱుందను; దూరమేఁ జనన్
జొక్కపుగొంతుసాచి ననుఁ జూచెను వెండియు మేడనుండి తాన్.

విదూ — నెచ్చెలీ! అగును. ఇప్పుడు నీవు చెప్పినది నిజమే కావచ్చును. అయినను నామె కులగోత్రస్వభావము లెట్టివో, పెండ్లి యయినదో లేదో, యది కొంచెమయినను దెలియకయే, యస్వతంత్ర యగునొకయతివ యట్లు చూచినంతమాత్రమున నీ కిట్టియాస యెట్లు కలిగినది?

మన్మ — అందుచేతనే నే నిట్లు తల్లడిల్లుచున్నాను

విదూ—మిత్రుఁడా! ఇఁక నిట్టిపరితాపము విడువుము. నే నాకులబాలికచే నిన్ను సంభావింపుదును.

మన్మ—(ఆసక్తితో) నెచ్చెలీ! ఎట్టుగాను?

విదూ—మిత్రుఁడా! అష్టజ్యోతిషసిద్ధాంతములను లెస్సగాఁ దెలిసినవాఁడ నని పురజనులందఱుఁ దమతమమంచికార్యములనుగూర్చి తప్పక నన్నే ప్రశ్నచేయుచుందురు; కాఁబట్టి యాలాటియప్పు డామెతలిదండ్రుల కెద్దియో గొప్పధనలాభము గలుగునని చెప్పి మెప్పించి యప్పుడు మీ యిద్దఱకును సమావేశము నిముసములోఁ గలుగఁ జేయుదును.

మన్మ—(నవ్వుకొని తనలో) తఱచుగా నీలాటివారికి తలకుఁ దగనిపనులకుఁ బూనుకొనుటయే యొకయలంకారము కదా? (ప్రకాశముగా) మిత్రుఁడా! అగును; నీనేర్పు నే నెఱుఁగుదును. ప్రస్తుతము మరలనాప్రియురాలిని నిండారఁ జూచుట కేమయిననుపాయ మున్నదేమో చెప్పుము.

విదూ—(పరిహాసముగా) మిత్రుఁడా! త్రికాలములయందలి వార్తలను నెఱుంగుట యందు నేర్పుగలిగిననాకును దెలియరాని దేమున్నది? (ధ్యానించుచున్నవాని వలెఁ గొంతసే పూరకుండి) మిత్రుఁడా! నీప్రియురాలిని జూచుట కుపాయము కనిపెట్టినాను.

మన్మ—నెచ్చెలీ! ఏలాగున?

విదూ—మిత్రుఁడా! నే నప్పుడప్పుడు సమిధలు మొదలయినవి తెచ్చుకొనుటకయి యిచ్చటికిఁ జేరువగా నే యుండినయానందనవనము చెంతను దిరుగుచువచ్చినప్పు డచ్చట నాడుకొనుచుఁ బెక్కండ్రు సరియీడుగలపురకన్యకలు నాకుఁ గనఁబడుచుందురు. కాఁబట్టి యెప్పుడయిన నామెయును నచ్చటికి రావచ్చునని యూహించెదను.

మన్మ—(ఆసక్తితో) మిత్రుఁడా! నీ విట్లు చెప్పుటచేత నాకానందనవనమునకుఁ బోవుటకు వేడుక కలుగుచున్నది. (అనిచిలుకను జేతితో నిమురుచు నుండలును వింటిబద్దయు నందుకొని నిలువఁబడి విదూషకునితో) నెచ్చెలీ! నీవుముందుగా నడువుము.

విదూ—(తనలో) సీల నూడఁబెరికినకోతిలాగున నీచిలుక నాకు నేనే తెచ్చుకొన్నాను. ఏమిగతి? (ప్రకాశముగా) మిత్రుఁడా! ఈలాగున నీలాగున (ఇద్దఱును నడుచుచున్నారు.)

మన్మ—(ముందువైపు చూచి) నెచ్చెలీ! ఈ వన మెంతచక్కఁగా నున్నదో చూచితివా ?

సీ. గమ్మగమ్మని క్రమ్ముకమ్మతావుల నెల్లతావుల నిడుమల్లెపూవు లొకట
జుమ్ముజుమ్మని క్రిమ్మి నెమ్మితో దుమ్మెదల్ సేవించువిరిదమ్మిపూవు లొకట
నందమై కన్దోయివిందుగా విరివొంది మురువందుగురివిందపూవు లొకట
జక్కనై మక్కువన్ జొక్కఁగాఁ దగి వేడ్కఁగావించుకలిగొట్టుపూవులొకట

తే. గీ. ముద్దుగుల్కెడులొద్దుగపూవు లొకటఁ
బొల్పులీనుకదంబంపుఁబూవు లొకటఁ
గలిగి యలరెడు నౌర! యీయలరుఁదోఁట
ఋతువు లాఱిటి కిరవొకో! యిది యనంగ.

(ఇట్లు ప్రక్కగుమ్మమునుండి నందనవనప్రవేశమును నటించి యంతటను నిరూపించి) ఆహా! యేమి! యీమందారాదులమహాభాగ్యము!

ఉ. వారిధిలోనఁ బుట్టువు నివాసము వాసవునింటఁ దోఁపుల
క్ష్మీరుచిరాంగి రత్నతతిచిత్రము రూపు ఫలావళుల్ సుధా
సారము లిట్టిసౌరమహిజంబుల నెన్న నిఁ కేటికిన్ మహో
దారులకీర్తు లెంచుతఱిఁ దప్పక వీనినె పోల్తు రన్న చోన్.

ఓహో! ఎల్లకోర్కులను బండింపఁజాలునివి నాయిచ్చను నెఱవేర్పకుండునే?

విదూ—నాకును గడుపునిండఁ దినుట కుండ్రముల నొసంగును.

మన్మ—నెచ్చెలీ! చూచితివా?

చ. ఒకయెడఁ గూయుకోయిలల నొప్పెడు పండినతియ్యమావు లిం
కొకకడఁ జిల్కచాల్గొఱుకుచుండినపండులనిండుదాడిమీ
ప్రకరము, లొక్కచో నెమలివాటపుటాటలఁ జూపునీపపా
లిక లొకచోట జుమ్మనునలిధ్వనులన్ వకులాలి గ్రాలెడున్.

విదూ—(అంతటను జూచి) మిత్రుఁడా! నా కిపు డిక్కడఁ దినుట కేమియు దొరక కున్నది. కాలియందు భ్రమరరేఖ యున్నవానివలె నీవంతటను దిరుగుచు, నెక్కడను గూర్చుండ కున్నావు. రాకాసివంటి యీయాఁకలిబాధచే మిక్కిలి డస్సియున్న నాకు ముందువైపున కడుగు పడకున్నది. కాఁబట్టి నే నీదట్టమయిననీడకలిగియున్న కడిమిచెట్టుక్రిందఁ గూర్చుండి కొంచెము నే పలసటఁ దీర్చుకొందును. (అని కూర్చుండఁబోవుచుఁ జెవియొగ్గి యాలకించి సంతోషముతో) మిత్రుఁడా! అదిగో! దక్షిణపువైపున వనభోజనమునకుఁ గూడిన

బ్రాహ్మణులమంత్రధ్వనులాగున వినఁబడుచున్నది. కాఁబట్టి నేనక్కడకు వెళ్లుటకు సమ్మతింపవలెను.

మన్మ—నెచ్చెలీ! మన్నింపరానివేడుక గలిగియున్నావు గదా?

విదూ—మిత్రుఁడా! నీకు మేలు గలుగునుగాక. (అని వెళ్లుచున్నాఁడు.)

మన్మ—(నవ్వుకొనుచు) ఏమి! కడుపుకూటివాఁడు వెళ్ళినాఁడా?

(ఇట్లు వనమంతయుఁ గలయఁజూచుచు సంతోషముతో)

ఉ. పొందుగ నల్లె మల్లె తనముందటియందపుమావిమోక నిం
పొందఁగఁ దమ్ములంపులతయు న్వెసఁబ్రాఁకెను బోఁకమ్రాఁకుపైఁ
బొందె లవంగవల్లియును బూని యశోకపుమ్రాని, నిట్లొహో
చెందుచునుండెఁ గూటములు చెట్లను దీవలుగూడ వేడుకన్.

అకటా! ఇచ్చటనైనను నమ్మచ్చకంటి కనఁబడదాయె నేమిసేయుదును?

(అని యాసక్తిని నటించుచున్నాఁడు.)

(తరువాతఁ బూవులు గోయుచున్నవిలాసము నభినయించుచుఁ చెలికత్తెలతోఁ గూడినరతి ప్రవేశించుచున్నది.)

రతి—(తనలో) అయ్యో! ఎప్పుడును లేనిది నిన్న నాకు మేడ యెక్కవలెనను వేడుక యెందుకుఁ గలిగినది! కలిగినను వీథియందుఁ దనగుఱ్ఱమును జక్కగా నడపించుకొనుచుఁ జనుచున్న యాయందకాఁడు దటాలున నా కేల కనఁబడెను? కనఁబడినను పురజనులందఱయందువలెఁ గాక నా కతనియం దెప్పటినుండియో చూచుచున్నవానివలెఁ గనినతోడనే కులబాలికలనడవడికి విరుద్ధముగా నిట్టి కూర్మి యేల కలిగెను? అయ్యో! ఇప్పుడు నాయుల్లము మిక్కిలి ధైర్యమును విడిచి తల్లిదండ్రులతో నతనిని దెలుపుటకుఁ దెగించుచున్న దేమిసేయుదును?

(ఇట్లు చింతించుకొనుచుఁ గొంచె మావలకు వెళ్లఁబోవుచున్నది.)

సఖి—(పరిహాసముగా) ఓసీ! రతీ! కోసినపువ్వులను నాచేత నున్నపూలపాత్రిలోఁ బోయక యెక్కడికే వెళ్లుచున్నావు?

రతి—(సిగ్గుచే ననురాగవికారములను గప్పుచు) ఓసీ! కీరవాణీ! క్రొంజివుళ్ళను నమలుటచే మిగుల నొగరొందినమెత్తనికుత్తుకలతో మిక్కిలి చక్కగాఁ గూయుచున్న గండుఁగోయిలలపంచమరవములచే వయసుకాండ్రమనముల నపహరించుచు విడువక వెడలుచున్న పువ్వుఁదేనెలను గ్రోలి జుమ్ముజుమ్మని రొదలుసేయు కొదమతుమ్మెదలకదుపులు గలిగి యలరునలరుగుత్తులతావుల నెల్లతావుల వెదచల్లుచుఁ

దియ్యనగు దోరపండ్లను జక్కఁగఁ దమముక్కులతోఁ గఱుక్కునం గొఱికికొని మెక్కుచు నడుమనడుమఁ గిలకిలయని పలుకుచున్న చిలుకలబారులు గలిగి చెలువారుచున్నయీతియ్యమామిడిచెట్టునందు నాడెందము దవులుకొని యుంటచే నే నిట్లు నీపరిహాసమునకు లోనయినానే.

రెండవసఖి—ఓసీ! రతీ! ఎల్లలోకములకు సంతోషమును గలిగించు మంచిగుణముచేత మనోహరుఁడై పురవీథియందు నిన్నఁ గనఁబడిన యావన్నెకానియందని చెప్పక యీమామిడిచెట్టుమీఁద నని వంకఁబెట్టుచున్నావేమే?

రతి—ఓసీ! కోకిలవాణీ! ముందుగానే కూడఁబలికికొన్నట్టు నీవును గిరవాణిలోనే కలియుచున్నావు. ఇఁక నీలాగున వట్టియనుమానము బెట్టుకొన్న మీదగ్గఱ నే నుండను.

(ప్రణయకోపముతో వేఱొకచోటికిఁ బోయి పువ్వులు కోయుచున్నది.)

మన్మ—(చేతియం దున్న చిలుకను జూచి) ఇది మిక్కిలి యాఁకొనియున్నది; దీని కేమయిన నాహారము కలుగఁజేయుదును. (ప్రక్కవైపు చూచి) ఇదిగో! చక్కనితీవప్రోవుచే నల్లుకొని సమీపమందే యొప్పుచున్న తియ్యమామిడిచెట్టునందు లెస్సగాఁ బండియున్న పండ్లగుత్తి కమ్మనివలపులచే నానెమ్మనమ్మును లోఁగొనుచున్నది. అందులోనుండి యొకపండు పడవైచెదను.

(వింటిబద్దయం దుండను బెట్టి పండుపడునట్లు కొట్టుచున్నాఁడు.)

రతి—(సంతసమును నబ్బురమును నొందుచుఁ జెలికత్తెలతో) చెలులారా! కోసినవిరులతో నిండియున్న నాయొడియందుఁ దనకుఁదానై పడినయీతియ్యమామిడిపండు చూచితిరా?

చెలులు—(సంతోషముతో సమీపించి) ప్రియసఖీ! నీ కీఫలలాభము మిక్కిలి వేగముగానే నీకోరిక నెఱవేఱునని సూచించుచున్నది.

మన్మ—(పండు తెచ్చుకొనుటయందలివేడుకతోఁ జెట్టువైపుగాఁ గొంచెము నడిచి రతినిజూచి సంతోషముతోఁ దొట్రుపాటు నొందుచు)

ఉ. ఈమెయె యీమెయే యెలమి నే మును గాంచినబోటి, వాటపుం
జామల దాఁటుమేటి, పలుచక్కనినీటులపేటి, నాటెఁబో
నామది నిట్లు భ్రాంతి యనినన్ జెలికత్తెలతోడ నిచ్చనై
కోమలి పలుకుతియ్యబలుకుల్ కడువీనులవిందు సేయునే?

ఆహా! ఇప్పుడు చూచినచో—

చ. సకియపిఱిందుబ ర్వెటులొా సైఁచుచు బొట్టనవ్రేళ్ల నిల్పి మీఁ
దికిఁ గడుసాఁగుటన్ వళులుదీఱి యొయారపుటారు మీఱ, బల్
ప్రకటము లైనయూర్పులపైఁటను బల్మరుఁ జిమ్మఁ, జెమ్మటల్
మొకమునఁ గ్రమ్మఁ, గొమ్మలను బూవులు గోయుట హాయిఁ జేయదే?

(లెస్సగా నిరూపించి) ఓహో! ఏమి యీమెసోయగము!

చ. చివుళులతోడఁగూడఁ దనచేతిని చేకొనఁగోరుఁ, జెల్లనా
పువుగమితోడ హాసరుచిపుంజముఁ దుఱింపఁగ నెంచుఁ, దొలఁగా
నివురును జెలుక్రు–చూపులను దేఁటులదాఁటులతోడఁగూడఁ, దా
నవుర! స్వభావము వందికొనయత్నము సేయును దీవ్రప్రవృత్తితోన్.

రతి—(మామిడిపండు చేతిలోనుంచుకొని విమర్శించి) ఓసీ! ఇది యొకవిలుకానియుండ దెబ్బచేఁ దొడిమ తెగి పడిన ట్టున్నదే.

చెలులు—ప్రియసఖీ! ఎట్లయిన నేమి? నీ కిది మంచిశకునము.

మన్మ—వీరిదగ్గఱకు వెళ్లుటకును మాటాడుటకును నా కిదియే కారణము. (తాను బడవైచినపండు తెచ్చుకొనువానివలె సమీపించుచున్నాఁడు.)

(అందఱును దొట్రుపడుచు నబ్బురముతో మన్మథుని జూచుచున్నారు.)

రతి—(సంతోషముతోఁ దనలో) వీథియందుఁ గనఁబడి నామనస్సు నెత్తుకొనిపోయిన యతఁ డెట్లో యిచ్చటికి వచ్చి నాకనుల కెలమిఁగలుగఁజేయు చుండుటచేతనే నిష్టదేవతను బూజించుటకు ఫలము వెంటనే లభించినది.

మన్మ—(ప్రత్యాశతోఁ దనలో)

ఆ. వె. మొగము సగము ద్రిప్పి ముదమొప్పఁగా నన్ను
గాంచు నల్లకలువకంటి యొప్పెఁ
గ్రొత్తరీతిఁ బూనుకొని నల్లగల్వలఁ
బన్ని కోటఁ గట్టుచున్నదనఁగ.

మఱియు—

క. వనితకనుదోయి కృష్ణా
ర్జునసంపద నెసఁగి పాండునూనుల దగునా
ఘనమైనసేన కెనయై
యొనరెడుఁ గర్ణాతిలంఘనోల్లాసముతోన్.

(ప్రకాశముగాఁ జెల్లికత్తెలతో) అతివలారా! మీ యనుఁగుఁజెలియ పూలు

కోసికొనుట కొనసాగినదా?

సఖులు—(వినయముతో) అయ్యా! ఇప్పుడే.

మన్మ—(తనలో) ఆహా! ఈపలు కెంతప్రౌఢముగ నున్నది. (ప్రకాశముగా) ఇకోక్రమలి తనకుఁ దానే పువ్వులు కోసికొనుటచేత మిగుల నలసినట్లు కనఁబడుచున్నది.

ఉ. వీడెను గొ ప్పదే మిగులవింతగ నింతికి మేనఁ జెమ్మటల్
గూడెను వేఁడియూర్పు లవిగో! గడు హెచ్చెను జేదకౌను న
ల్లాడెడు రెండొ మూడొ పువు లాసను నీసతి కోసినంతనే
వీడక చేతిత్రేళ్లు కడువేగముగా నెఱుపెక్కె నక్కటా!

రతి—(సిగ్గును నటించుచున్నది.)

సఖులు—మహాత్మా! తియ్యనయినయిట్టిమీపలుకులచేత మా చెలికత్తె యలసటయంత యుఁ దీఱినది.

మన్మ—(తనలో) ఓహో! వీరిమాట సాభిప్రాయముగా నొప్పుచున్నది; (ప్రకాశముగా) కల్యాణీ! మీకు నాయెడఁ జెలిమి గలిగియున్న చోఁ గడచినరాత్రి యందలరిన చంద్రునికిరణములసంబంధముచే నిపుడు గొంచెముగా స్రవించుచుఁ జల్లగాలిచే మిక్కిలి చల్లఁబడి యీగుజ్జుమెలమావికిక్రింద నలరారుచున్న జాబిల్లి రాతిన్నెపైఁ గూర్చుండుఁడు.

సఖులు—(విశ్వాసముతో) మహాత్మా! అనుగ్రహింపఁబడినాము. (రతితో) నెచ్చెలీ పుణ్యావశమున నబ్బినయీ చెలికానికోరిక మనకు మన్నింపఁదగినదేకదా?

(అందఱును గూర్చుండుచున్నారు.)

మన్మ—సుందరీ! మీరు మిగుల మంచిగానుండుటచేత నిప్పుడు మిమ్ముఁ గొంచెము ప్రశ్న చేయుటకుఁ గోరిక వొడముచున్నది.

సఖులు—అయ్యా! మేమును సావధానముగానే యున్నాము.

మన్మ—తరుణీ! ఈయోగ్యురాలిపుట్టువుచే నేయభిజనునిజన్మము సఫల మయినది? మఱియు;

తే. గీ. కుసుమ దువ్వకయుంటచేఁ బరుసఁదనము
నందె, నలుగిడకుంటచే నవయవములఁ
జెందె మలినత, యదె! పట్టు చీరఁ గట్టఁ
గాన మదినెంతు నింతి నోమూనె ననుచు.

# రతిమన్మథనాటకము.

సఖులు—అయ్యా! మాయనుఁగుఁజెలి యగునీమె పూజ్యుఁడయినరాగునికి ముదితయను నామెయందుఁ బుట్టినరతి యనుకన్నియ; ముల్లోకములందలిసుందరులను మించఁజాలుచక్కఁదనముచే నలరుచున్న యీమెకు నానాఁటికి జవ్వన మతిశయించుచుండుటచేతఁ దగినమగనిని జెట్టవట్టుటకయి పరదేవతానుగ్రహముగోరి, గురుజన ముపదేశించిన పూజావిధానమును బూనియుంటచేత నిట్లు నియమమునుబట్టి యున్నది. కాఁబట్టియే యిట్టు పూవులను దనకుఁదానే కోసికొనుచున్నది.

మన్మ—(ఆశ్వాసపూర్వకముగాఁ దనలో) అయ్యో! ఎందు కీమెయందు నా కిప్రేమానుబంధము? (ప్రకాశముగా) పొలఁతీ! కన్నెలయందుఁ గోరఁదగినకులగుణములు రెండును నిక్కడనే యున్నవిగదా? అయినను బరదేవతానుగ్రహము నొందఁగోరుట యుక్తమే.

రతి—(తనలో) మహాభాగుఁడు బాగుగా నూహించినాఁడు.

సఖులు—అయ్యా! స్వభావముచేతనే మంచిదైనవిూనడవడినిబట్టిమాకును బూజ్యులయిన తమనామధేయ మేమో యెఱుఁగఁ గోరికవొడముచున్నది.

మన్మ—భద్రులారా! మన్మథుఁ డనునతనిని విూ రిదివఱకు వినియే యుందురుగదా!

సఖులు—అయ్యా! అవును లెస్సగా వినియున్నాము.

మన్మ—నన్నతనినిగానే తెలిసికొండు.

సఖులు—(జనాంతికముగా) ఏవిూ! ఇతఁడేనా! యందములకెల్ల మనికిపట్టును, స్త్రీపురుషులకువిలాసములను నేర్పుగురువును, భగవంతుఁడయినయాలక్ష్మీవల్లభుని కొమరుండును నని మనము వినుచుండినమన్మథుఁ డనునతఁడు! (ప్రకాశముగా) మహాత్మా! నేఁడు విూదర్శనలాభము నొంది కృతార్థినుల మయినాము.

మన్మ—(పుట్టుచున్నయవస్థావిశేషము గలరతిని జూచి తనలో)

తే. గీ. కనుచు నుడుగుచుఁ గ్రమ్మఱఁ గనుచుఁ జూడ్కు-
లలయఁ బులకించి చిఱుచెమ్మటలను బూని
మే నెసంగఁగ జనియించి మెఱయు తెఱవ
చిఱునగవు పెక్కుకాఱంబు చెలఁగుఁ గాత!

సఖులు—(వెనుకఁ దిరిగి రతిమన్మథులను నిరూపించుచు) ఓహో! ఒండొరులకుఁ దగిన యందము గలిగియలరుచున్న యీయిరువురకును పొందుగలుగునేని వీరిని నిర్మించినతమ్మిచూలినేర్పు సార్థక మగునుగదా?

రతి—(ఔత్సుక్యముతోఁ దనలో) నాకంతభాగ్యమా?

పరిచారిక—అమ్మా! అమ్మగారు పూజాద్రవ్యమంతయు జతపఱిచి మీకొఱకుఁ గని పెట్టుకొని యున్నారు. కాఁబట్టి కోవెలకుఁ బోవుటకు మీరు త్వరగా రావలెను.

మన్మ—(విషాదముతోఁ దనలో) ఇదియే కదా! చిరకాలమున కమృతమును గురియుచున్న మబ్బుగమిని తెప్పలువేయక కన్నులతోఁ గ్రోలుచున్న చాతకపుఁబిల్లకు గోరిక దూరమానట్లుగా సుడిగాలి వీచుట!

రతి—(నిరుత్సాహముగాఁ దనలో) అయ్యో! పాపపుదైవము నిముసమయినను నా కన్నులకుఁ గలుగుసుఖమున కోర్వలేక పోయెను!

(ఇట్లు వెళ్ళఁగోరుచుఁ జెలులమోమువంకఁ జూచుచున్నది.)

సఖులు—(మన్మథునితో) ఎల్లప్పుడును జూడఁదగినసన్నిధానముగల పూజ్యులయిన తమదర్శనశుభమును మరలఁ గలుగఁజేయుదురని కోరుచున్నాము.

మన్మ—(అనుజ్ఞ నిచ్చుచు) మంచిది; మీపనిని జూచుకొండు; మఱచిపోక నన్నప్పుడప్పుడు తలఁచుచుందురని నమ్మెదను.

రతి—(తనలో) మహాభాగుఁడా! నీచేత నపహృతమయిన మనస్సుగల నాకుఁ దలఁచుకొనుట కెట్లు వీల్పడును?

సఖులు—అయ్యో! అట్లు మేముకదా కోరవలసినది?

రతి—(తనలో) అయ్యో! ఏమి సేయుదును? దాఁటుటకు వల్లగానితల్లిగారియానతి నన్ను గట్టిగఁబట్టి లాగికొని పోవుచున్నది.

(ఇష్టములేకయే యెట్టకేనిఁ జెలులతోఁ గూడఁ బరిచారికవెంట వెళ్ళుచున్నది.)

మన్మ—(పరితాపముతో) అయ్యో! నాకనులకుఁ బండువు చేయుచున్న యీవెన్నెల యకాలమందలి మబ్బుచేబలె నాకూళదైవముచేఁ గప్పఁబడిపోయె నేమి సేయుదును? అగును; మేలు లెప్పుడుఁ జెఱుపుతోనే కూడియుండును గదా! కానిమ్ము. ఇప్పు డీమెను బెండ్లియాడుట కెట్లు వలనుపడును? (చింతను నటించుచు సాశ్వాసముగా) పరదేవతయొక్క చతుర్థావరణదేవత యగుసర్వార్థసాధిక మాయందు సహజమయినపేర్మి గలది గదా! కాఁబట్టి యీలావణ్యసరసియం దీరేవుననే సులువుగాఁ బ్రవేశింపవచ్చును. ఇప్పుడు చేయవలసినపనియందు మంత్రి యగు వసంతుని నియమింతును. (జ్ఞప్తికిఁ దెచ్చుకొని) అయ్యో! పాపము! ప్రియురాలిని జూచుటయందలి వేడుకచేత నే నీచిలుకకు మేఁతపెట్టుట మఱచిపోయినాను. (మరల వింటిబద్దయం దుండను బెట్టి మఱియొకపండు పడవైచి చిలుక కందిచ్చుచున్నాఁడు.)

(తెరలోఁ గలకలధ్వని యైనతరువాత)

ఉ. ఉన్నతనాళనీరజదళోదిత పై తగుచల్లనీడలో
నన్నివసించి ముక్కుల మృణాలము లూని పరస్పరార్పణే
చ్ఛన్నటియించుజక్కవలజంటకుఁ బందుమె యిద్దినార్థమున్

(ఆలకించి వేడుకతో)

అవును. వైతాళికుఁడు బాగుగాఁ జెప్పినాఁడు.
పన్నుగ నేనిడెంద మెటఁబాల్పడు నద్దియె వాని కింపగున్.

(మీఁదుగాఁ జూచి)

ఏమీ! భగవంతుఁ డగునుష్ణకిరణుఁడు మింటినడుమనె యొప్పుచున్నాఁడా! ఔను.

చ. తడయక దవ్వుగాఁ దెరువు దాఁటుకవచ్చినప్రొద్దు తేరదే!
నడిగగనంబునందుఁ జలనంబటి జాగుగ నిల్చుటెన్నఁగాఁ
బడుచును లేచు మంబఱచివచ్చినతేజుల వేల్పుటేటిలోఁ
బడలిక దీఱఁ దానమును బానముఁ జేయ నొనర్చి తచ్ఛ్రమం
బుడిగినదాఁక నందిడియెనో యరుణుండని నాకుఁ దోఁచెడిన్.

కాఁబట్టి ప్రియతమావిరహానలమున సంతప్తహృదయుఁడ నగు నేను దుర్నివారము లగుసర్వతాపములను దొలఁగింపఁజాలి యానందనము ప్రక్కను బ్రవహించుచున్న మందాకినీనదియందు స్నానముచేసికొని మాధ్యాహ్నికవిధిని దీర్చుకొందును.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది సత్యవోలు కామేశ్వరరాయనిచేఁ దెలిఁగింపఁబడిన
రతిమన్మథనాటకమునందుఁ బ్రథమాంకము.

శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

## ద్వితీయాంకము మొదటఁబ్రవేశకము.

(తరువాత పరిచారికలు ప్రవేశించుచున్నారు.)

ఒకతె—సఖీ! మయూరికా! అంతగా ముద్దరాలై యుండుమనరాచకన్నియ యిప్పు డెంతటి దైనదే! వింతగా నున్నది!

రెండవది—సఖీ! సారికా! సరసురాలవే; నీ వాకన్నియయందుఁ గలిగిన జవ్వనమును జూడనే లేదాయేమి?

చ. సముచిగ యంత్రపుత్రికలఘంటల నొంటిగఁ బొంచి కాంచుఁ జి
త్తరువులమీఁదియాల్మగలఁ దద్దయు నాశయమొప్పఁ జూచు, స్త్రీ
పురుషులచర్య నాటకపు మూలమున న్వని యిచ్చనొందుఁ దాఁ
గర మెద సిగ్గునొందుఁ జెలికత్తెలదేమని ప్రశ్నఁజేసినన్.

కాఁబట్టియే తగినయల్లునికొఱకు మిక్కిలి యాతురచిత్తులై తల్లిదండ్రు లాలోచించునట్లు తోఁచుచున్నది.

మయూరిక—సఖీ! కన్యాపితృత్వ మేరికినిఁ జింతకు మూలమయినదే కదా? కాఁబట్టియే యొకయనుభవశాలి యీలాగునఁ జెప్పియున్నాఁడు.

"తే. గీ. పుత్రి పుట్టినయప్పుడే పొడమి సమము
గాని యెదుగుచుఁ జొట్టాలలోనఁ బూని
పెండ్లి సేయుటఁ గూర్చినపెనుతలంపు
మాటిమాటికిఁ దండ్రిలమదిఁ గలంచు."

సారిక—సఖీ! మయూరికా! నిన్నటిరాత్రి తల్లిదండ్రులు కన్యకుఁ దగినమగని నుద్దేశించి మాటలాడుకొనుచుఁ బూజ్యు లయినయామన్మథుఁడుగారినిగూర్చి యీలాగున ననుకొనుచుండఁగా నీవును వినియే యున్నావుగదా.

"ఉ. వెన్నుఁడు తండ్రి కల్మిచెలి వేలుపుఁబెద్దలు తల్లియన్నయున్
వెన్నెలఱేఁడుమాతులుఁడు, వేగనులాతఁడు పెద్దతండ్రి, మే
లెన్నెడిమేనయత్త శివునింతి, నదీశుఁడు తాత, యైనయా
క్రొన్ననవిల్తుఁడే మగఁడు కోరఁగనుండునె యొండొకెద్దియున్.

ఇదిగాక కర్ణాకర్ణిగాఁ దమకూఁతుపరితాపవర్తనముగూడఁ దండ్రిగారు వినియే యున్నారుగదా! ఈలాగున నొండొరులకుఁ దగినచుట్టరికము దొరకినప్పుడింక ను వారికిఁ బెండ్లిసేయక జాలము చేయుచున్నారేమే!

మయూ—ఓసీ!లోకమునందు ముందుగా మగపైపువారు కన్నను గోరుట మంచిదను వాడుక నీ వెఱుఁగవా యేమి?

సారిక—(చింతింపుచు) ఓసీ! అట్టి పాసఁగుబా టెట్లు జరుగును?

మయూ—సఖీ! నీ వట్లు సందియము నొందఁబనిలేదు. మనరాచకన్నియచేయు పూజకు మెచ్చి పరదేవత యాపనియం దామెతల్లిగారికిఁ జిన్నతనమునాటినుం డియుఁ జెలికత్తెయగు సర్వార్థసాధికను దనకుఁదానే యేర్పఱిచినది. కాఁబట్టి యిదియంతయు నామెయే నెఱవేర్చును.

సారి—ఓహో! పరదేవతకనికర మెంతసులువయినది! సఖీ! తేనెనాకినపిమ్మట నేయి దాఁగిన ట్లామన్మథుఁడుగారిని మరల నందనవనమందు నిండారుగాఁ జూచుట కూడ నబ్బుటచేత మనరాకన్నియమనసున కిట్టితొట్రుపాటు కలిగినదే.

మయూ—ఓసీ! ఆయనయును మనరతిని జూచినప్పటినుండియు మిక్కిలి పొక్కుచునే యున్నట్టు వీరి కొండొరులయెడఁ గూర్మి గలిగింపఁబూనుకొనియున్న యా భగవతి ప్రియశిష్యురా లగువశినిగారివలన దెలిసినది.

సారి—నాకుఁ బ్రియముగా నున్నది. నాకుఁ బ్రియముగా నున్నది.

మయూ—ఓసి! నీ విప్పు డెక్కడకు వెళ్లుచున్నావు?

సారి—సఖీ! మనభర్తృదారికయనుఁగుఁజెలులగుకీరవాణియుఁ గోకిలవాణియుఁ జెప్పు టచేత శీతోపచారసామగ్రి తీసికొనివచ్చుటకు.

మయూ—ప్రియసఖీ! ఇది మండుచున్నయగ్గిలో నేయిపోయుటయేకాని వారిద్దఱు మొదలనాలోచించినదే ఆమెకుఁ గొంతవేడుక గలిగించుటకు వలనుగానుండునని తలఁచెదను.

సారి—ఎట్టుగాను?

మయూ—(సారిక చెవిచెంత) ఈలాగున.

సారి—(తలయూపుచు) ఓసీ! ఇది బాగుగా నున్నది. వేగ మాపనిని నీవు చక్కఁ బెట్టుము. నేనును నాపనిని నెఱవేర్చుకొందును.

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇదిప్రవేశకము.

శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

## ద్వితీయాంకము.

(తరువాత ధారాగృహమందుండి చెలిమికత్తెలవలన నుపచారము నొందుచున్నరతి ప్రవేశించుచున్నది.)

రతి—(తనలో) డెందమా! నందనవనమందుఁ గొంచెముకాలము క్రిందటనే చూచియుండియు నెప్పుడో చూచినవానినిబలె నాచెల్వునిఁ దలఁచి నీవింతగాఁ దల్లడిల్లుచున్నా వేమి? నీవంత యెట్లయినను దీఱవచ్చును; కాని, నీయందే యెల్లప్పుడును నిల్చియుండు నాసహజకోమలుని డెంద మెంత కొందలపడుచుండునో యని మిగుల వగచుచున్నాను.

సఖులు—ప్రియసఖీ! ఈ నీటియంత్రములతోఁ గూడిన నెలవునందుఁ గ్రొంజివురుశాన్పునఁ బవళించి మంచిగంధముచేఁ బూయఁబడినమేనితో నున్న నీ కీవట్టివేళ్లవిసనకఱ్ఱ వలనఁ బుట్టుచల్లగాలి కొంచెము హాయిగా నున్నదా?

రతి—(వినిపించుకొనకయే తనలో) అయ్యో! వేఱొకపనియందలితలఁపు మాని యెల్లప్పుడుఁ దన్నే తలఁచుచున్నను నామనసున కించుకయినను సుఖము గలిగింపని యతఁడు నాకుఁ బ్రియుఁ డెట్లౌను?

సఖులు—(విషాదముతో) అనుఁగునెచ్చెలీ! మే మడుగుచున్న మాటకు బదులు పలుకకున్నా వేమి?

రతి—(వినఁబడుట నభినయించి) ఓసీ! ఏమనుచున్నారు?

సఖు—(ఈ నీటియంత్రములతో ననుపూర్వవాక్యము మరల ననుచున్నారు.)

రతి—(నిట్టూర్పు పుచ్చుచు) చెలులారా! ఈలాటితప్తశరపంజరమందు సూదికొనసెజ్జపైఁ బడి తుషాగ్నిచే నావరింపఁ బడినయొడలు గలిగిననా కీయలిగినచిలువబుస్సలవలనఁ బుట్టువేఁడిగాలి కూడ హాయిగా నెట్లుండును?

సఖు—(నిందించుచున్నవారివలె) నెచ్చెలీ! పెద్దవాండ్రిమొగమైనను జూడక కులబాలి
కలరీతిని విడిచిపెట్టి నీవింతలోనే యీలాటియునికిని బూనితివేమి ?

రతి—(ప్రణయకోపముతో) చెలులారా! ఇఁక మీయుపదేశములు చాలించి యిప్ప
టికిఁ బోలినపని నాచరింపరే.

సఖు—(తొట్రుపడుచు నొండొరులతో) ఓసీ! ఇప్పుడు వలకాఁకలచే నెండి మొఱమొఱ
లాడుచున్నయీచిగురుపాన్పు దీసివైచి మెత్తనిపూఁబాన్పున శయనింపఁజేసి
మెయినిండ వట్టివేళ్ళగందముఁ బూసి క్రొందామరతూండ్లచే నవయవములెల్ల
నొత్తుచుఁ బన్నీటిచే మఱింతచల్లగాఁ జేయఁబడినతామరాకులచే విసరుచు
నెచ్చెలి నుపచరింపుదము రారే (అట్లు చేయుచున్నారు.)

రతి—(రెట్టించినపరితాపముతో) ఓసీ! నాజీవితము వజ్రలేపకీలితము కాఁబోలును.
కాకున్న మీరు చేయుచున్న యీప్రయోగములచేతఁ గూడ విడిచిపోకుండునే?

కీరవాణి—ఓసీ! కోకిలవాణీ! ఒరు లగునీలుకాండ్రను వలచినచెలువలకు బాళిఁగొలుపు
నన్నను నాకందుఁడు తనయందే వలపొందినయిక్కన్నెనుగూడ నింతగావేచుట
వింతగానున్నదే.

కోకిలవాణి—సఖీ! కీరవాణీ! ఓరికయునను నైజము మల్లించుకొనుట కలవిగాదుగదా?

రతి—(సరస మయినయుల్లాసముతో) ఓసీ! తొరగా రతనపుఁబీట నిటుతీసికొనిరా!
ఇదిగో! నాచెలువుఁడు నా వలవంతలను దెలిసికాఁబోలును నీలాగున వచ్చు
చున్నాఁడు.

సఖులు—(ఉద్వేగముతో) చెలీ! నీ వీలాగునఁ బొరఁబడుచున్నా వేమి? ఈలాటికన్ని
య లుండులోనగరిలోనికి లాఁతివాఁడు వచ్చుననుమాటయైన నెట్లు కలుగును ?

రతి—(అసూయతో) మీ కీరతియును లాఁతిదే కాఁబోలును.

సఖులు—(తమలో) అన్నా! నెచ్చెలికతనియందలికూర్మి యెంతగా నాటియున్నదే!

రతి—ఓసీ! మీ రద్వైతమును బూనితిరా యేమి ? కనులారఁ జూచుచున్నదానినే
లేదని చెప్పఁదొడఁగుచున్నారు.

సఖులు—ప్రియసఖీ! వివేకినీ! భ్రాంతిచేఁ దోఁచినదికూడ నిక్కమైన దెట్లగును ?
(కోపముతోఁబలె) అప్పుడంతగా నీకు మేము బొంకుచున్నామనియేతోఁచినది.

రతి—(కన్నీరు నించుచు) ఏమీ! నాచెల్వుఁ డిక్కడ లేఁడా? అయ్యో మందభాగ్య
రాల నైననేనును మోసపోయినాను. (మూర్ఛ నొందుచున్నది.)

సఖు—(భయముచే వడఁకుచు విసనకఱ్ఱతో విసరుచు) అనుఁగునెచ్చెలీ! ఊఱడిల్లు

మూఱడిల్లుము; వెన్నెలవలెఁ జల్లనయిననీచూడ్కి—ని బఱపి వేగముగాఁ బార్శ్వ జనసంతుష్టి గావింపుము.

రతి—(నిట్టూర్పు పుచ్చుచుఁ గన్నులువిప్పి ప్రక్క—వైపుగాఁ జూచి) ఓసీ! నాప్రియ జనుఁ డిక్క—డ లేకున్నను బార్శ్వజనసంతుష్టి చేయుమని పలికె నన్ను మోస పుచ్చినా వేమి? (మరల మూర్ఛచేఁ గన్నులు మూసికొనుచున్నది.)

సఖులు—(మనసు విఱుచుకొని) అయ్యో! ఇప్పు డీమె నేలాగున నూఱడింతుము? తన వేఁడుకకయి యీమె స్వయముగా వ్రాసికొనిన యాచెలువునిచిత్తరువును దెలివిమాలినమనసారిక యెక్క—డనో పాఱవైచినది; ఇఁక మనము చేయవలసిన దేమియుఁ గానరాదు; మయూరికవలన నీమెపరితాపవర్తమానము తెలియఁ జేయఁ బడినదిగనుక, యిప్పు డాసర్వార్థసాధికయే యీమె కెక్క—డ మన్మథుఁ డు కనఁబడునట్లుచేసి యీవంతఁ గొంతఁ దొలఁగించుటయే గతి.

మన్మ—నెచ్చెలీ! సాంఖ్యాయన! నీవు నిన్న వనభోజనమునందలి వేడుకచేఁ జూడఁ దగినదానిని జూడక మోసపోయినావు సుమీ!

విదూ—మిత్రమా! నీతోఁగూడ రెండుజాములవఱకును జెట్టుచెట్టును దిరుగుచు మిక్కి—లియాఁకలిచేఁ బీడింపఁబడుటవలన వేగముగా వెళ్ళి కడుపునిండ భుజించినాను.

మన్మ—నెచ్చెలీ! ఇందు కేమియు సందియము లేదు. వింటిబద్దవలన విడువఁబడిన యుండదెబ్బచేఁ దొడిమ తెగి పడినతియ్యమామిడిపండు తీసికొనుటకుఁ గొంచెము వంగి

తే. గీ. ఇచ్చ మేదాల్చుపూఁదోటలచ్చి యనఁగ
కెంపు నెఘలించునాకోరిక—పంట యనఁగ
మావిమోకను బ్రాఁకెడుమల్లె యనఁగ
నాకుఁ గనవయ్యె నయ్యెలనాఁగ వేగ.

సఖు—(దాచి యబ్బురముతో జనాంతికముగా) భగవతియోగమహిమ కన్పడ నా రంభించినట్టున్నది!

రతి—(ఆలకించుట నభినయించి యానవాలుపట్టుచు మెల్లఁగాఁ గన్నులు విప్పి చూచు చున్నది.)

సఖు—(ఆశ్వాసముతో) పుణ్యావశమున నెచ్చెలి మరల జీవితము నొందినది. (వెనుకఁ దిరిగి) తనచెలువునిమాట యానవాలుకూడఁ బట్టినట్టున్నదే!

విదూ—(తనలో) ఇది జ్వరము తగిలినవానిమీఁద బన్నీరుచల్లుట. (ప్రకాశముగా)

మిత్రుఁడా! తన్మయుండవై యున్న నీకుఁగనఁబడినది నిక్కముగా నామెయే నా? లేక నీవట్లు భ్రాంతిపడితివా?

మన్మ—తెలివిమాలినవాఁడా! నా కిది భ్రాంతియేలాగున?

చ. కలికి ననుం దటాలుననుగాంచి యొడల్ పులకింపఁ జెమ్మటల్
వెలయఁగఁ గోసినట్టివిరి వేళ్లలనుండి తొలంగ, లాఁతికేల్
పలుమఱు జాఱుచుండునలపైఁటను జేర్చునెడ న్వడంక, దృ
ష్టులు ననుఁజెందుచు న్మఱలుచుం బొలుపొందఁగ నిల్చె జాగుగాన్.

రతి—(విని సంభ్రమముతోఁ బ్రక్క కొత్తిగిల్లి మేడపై నున్నమన్మథుని జూచి సంతోషముతోఁ దనలో)

తే. గీ. నల్లగల్వలచాయమే నుల్లసిల్ల
నిండుతొగఱేని నగుమోము నీటుమీఱ
నలరు నీతఁడు గడుమురులొల్కిలిపి మిగుల
హాయిఁజేయుచు నుండెఁ గన్గొయి కిపుడు.

(ప్రకాశముగా) ఓసీ! ఇదియును భ్రాంతిచేఁ గల్పించుకొనినదేనా?

సఖులు—(జనాంతికముగా) ఈగోప్యమును మన మిప్పుడే తెలియనియ్యఁగూడదు; కాఁబట్టి మన మీమెలోనె కూడుదము. (ప్రకాశముగా) నెచ్చెలీ! ఇది నిక్కమే కావచ్చును.

రతి—ఓసీ! సహజకోమలుఁ డయినయామహాభాగుఁ డీనడుమ మనమేడయెదుట నొక మేడ గట్టించుకొన్న ట్టున్నదే!

సఖులు—(నిజమును దాఁటుచు) సఖీ! అవును; ఆలాగుననే తోఁచుచున్నది.

విదూ—మిత్రుఁడా! అట్లు మిక్కిలి యొడలు మఱచి యున్నప్పుడు నీ వామెచేయి పట్టుకొనలేకపోయినావా?

మన్మ—తెలివిమాలినవాఁడా! న న్నంతయధీరునిగాఁ దలఁచుచున్నావా యేమి?

విదూ—మిత్రమా! లేదు; నీవు మఱల వచ్చి నాకంటఁబడుటచేత మిక్కిలి ధీరుఁడవే యని తలఁచుచున్నాను.

మన్మ—(తలఁచుకొని యుల్లాసముతో) నెచ్చెలీ! యాసుందరియందము చెప్పనలవి కాదు సుమీ!

చ. కొనకొని వచ్చుజవ్వన మకుంఠితలీలను గ్రాలబాల, వా
ల్గనులను మించనీయ కరికట్టెను ముక్కును వీనుదోయి, పెం

పునఁదగుబల్ పిఱుందు పెనుపూనికఁ యిఁకెద్దియుఁ గాంచనీయ దిం
పెనసినయిట్టియింతిమెయి నెంతును యౌవనశిల్పమం చెదన్.

విదూ—మిత్రుఁడా! అనురాగ మేవస్తువునందును సౌందర్యమును గలిగించును గదా!

మన్మ—స్వభావముచేతనే యందకత్తె యగునాబిత్తరిచో నట్లు గాదు; వినుము.

చ. కురులనుగండుఁదుమ్మెదలగుంపులలోపలినుండి చానవా
తెరవిరిదేనె లాన నొకతేఁటులబా రరు వెంచి యచ్చటన్
సరగున ముక్కుఁ గాంచి యది సంపెఁగపూ వని యెంచి నిల్చెఁబో
యిరు తెగలై భయంబునఁ జలించుచుఁ గన్బొమలన్న పేరితోన్.

రతి—(సందియముతో) ఓసీ! ఈమహాభాగునిచేఁ గూడ మెప్పొందుచున్న యాకన్య యేధన్యయో?

సఖులు—ప్రియసఖీ! వింద ము; ముం దదియును దెల్లము కావచ్చును.

విదూ—మిత్రమా! డప్పిఁగొనినయతఁ డొగరునీటినిబలె నీకిష్టమయినదానిని నెక్కువ గాఁ బొగడుచు నన్ను సంతోషపెట్టుచున్నావు; అట్లుకాదు; నా కామెరూప మును జిత్రపటముమీఁద వ్రాసి చూపింపవలెను.

మన్మ—నెచ్చెలీ! అగును; నాకును జిత్తరువందైన నవ్వాల్గంటిని మఱలఁ జూడ వేడుక కలిగే యున్నది. (తెఱవంకఁ జూచి) కంచుకీ! చిత్రఫలక మిటుతీసికొనిరా.

కంచుకి—(ప్రవేశించి మ్రొక్కి) దేవా! ఇదిగో! సిద్ధముగానే యున్నది.

(చిత్రపటమును ముందర నుంచుచున్నాఁడు.)

మన్మ—(పాదములనుండియుఁ జూచి) మూర్ఖుఁడా! వ్రాయఁబడియున్నదీనినా నేఁ దెమ్మనినది?

కంచుకి—(భయముతో) దేవా! మన్నింపవలెను; దేవరవారు సామాన్యముగా సెల విచ్చుటచేత నావలనఁ బొరపాటు వచ్చినది.

విదూ—(అనునయించుచు) మిత్రుఁడా! ప్రమాద మనునది మానవధర్మమేకదా! (చిత్రపటమును బుచ్చుకొని నిరూపించుచు) ఏమీ! మిత్రుఁడేనా! యిక్కడ వ్రాయఁబడినవాఁడు! కానిమ్ము; ప్రక్కవైపు వ్రాయుటకుఁ జోటున్నది.

మన్మ—ఇది యేలాగున వచ్చినది?

కంచుకి—(అడఁకువతో) స్వామీ! దేవరవారితోఁటకావలివాఁడు "పూజ్యులయిన రాగుఁడుగారికన్నెలయింటిదాని యగుసారిక, మనపూఁదోఁటయందలికొల నులోనితామరపూలును దూడులు నాకులుఁ దీసికొని వేగముగా వెళ్లుచు నీపట

ము నొడ్డున నుంచి మఱచిపోయినది; కాఁబట్టి యిది నేను దీసికొని వచ్చినాను" అని చెప్పి యిచ్చి వెళ్ళినాఁడు.

విదూ—మిత్రుఁడా! అట్లయిన దానియజమానునియింట నెద్దియో బ్రాహ్మణసంతర్పణ చేయుదు రని తోఁచుచున్నది. (అని లేవఁబోవుచున్నాఁడు)

మన్మ—(చిఱునవ్వుతో నాతనిచేయి పట్టుకొని) తెలివితక్కువవాఁడా! తామరతూడులు తిందురా యేమి? (కంచుకితో) భద్రా! నీవు నీపని చూచుకొమ్ము.

కంచుకి—దేవరకు మేలు కలుగును గాక. (అని వెళ్లుచున్నాఁడు)

విదూ—మిత్రుఁడా! నాతలఁపును బూర్వపక్షము చేసితివిగదా! మరల నీవేమిసిద్ధాంతము చేసినావు?

మన్మ—ఇది యొకజవ్వనివిరహతాపముఁ దొలఁగింపఁజేయుప్రయత్న మని యూహించెదను.

విదూ—అగు నిది సరిగా నున్నది. (మన్మథునిపటమును విమర్శించి) మిత్రుఁడా! నే నీపట్టణమందలిశిల్పకారకులయందలి నేర్పును నెఱుంగుదును. మున్నెన్నఁడును నిట్టిచిత్తరువును జూచియుండలేదు; ఈలాటివింత యగువ్రాఁత నే ర్పవ్వరిదై యుండునో!

మన్మ—(విదూషకునిచేత నున్న చిత్రపటమును బుచ్చుకొని లెస్సగా విమర్శించి గగుర్పొడిచినమేనితో) నెచ్చెలీ!

ఉ. ఆఁకొని స్రుక్కియున్న కరమందలిచిల్క, చెమర్చి రోమహ
ర్షాకరమై యొసంగుసకలాంగకముల్, గడుఁ దేఱిచూచునా
లోకము, లీయలక్తకనిరూఢకరాంగుళి, యంజనంబు లే
ఖాకుటిలత్వముం, దెలుపుఁ గల్కి స్వయంబుగ వ్రాసినట్లుగాన్.

అగును; సారికచే విడువఁబడినదనికూడఁ జెప్పుటచేత నిఁక నిందుకు సందియము లేదు.

సఖులు—(జనాంతికముగా) ఈమహాభాగునికి మనయనుఁగుజెలియందుఁ గలకూర్మి బయల్పడుటచే మనచేటిమఱపును మనకు మేలేయయినది.

విదూ—ముసలాగ్ర (అనఁబోయి) అయ్యో! తడఁబాటు! కుశాగ్రబుద్ధి వగు నీవు బాగుగా నూహించినావు.

మన్మ—నెచ్చెలీ! మన్మథునిపుట్టువు నేఁడు సఫల మయినదిగదా!

విదూ—మిత్రమా! నిన్ను నీవే మెచ్చుకొను టిఁక మాని నీప్రియురాలిని వ్రాయ

నారంభింపుము.

మన్మ—నెచ్చెలీ! లేడిమాపులు గలయీచేడియయందమంతయు వ్రాయుటకుఁ దగిన నేర్పు నాకెక్కడ? అయినను బ్రాణస్నేహితుఁడ వగునీమాట దాఁటరాదు.

(రతిపోలికను వ్రాయుచు)

ఉ. వేడుకతోడ నెట్టెటులో పెద్దయు యత్నముఁ జేసి వ్రాసినం
జేడియయంగకం బొకటి, చిత్తముఁ జూపును నందు నిల్పి వే
పీడవు, చెమ్మటల్ గలిగి వేమఱుఁ గంపమునొంది వ్రాయఁ జే
యాడ దిఁకెట్టు లాపొలఁతియాకృతి నంతయు వ్రాయుదుం జెలీ.

(ఎట్టకేని వ్రాసి చూపించుచున్నాఁడు.)

విదూ—(చూచి సంతోషముతోఁ దనలో) మిత్రున కీమెయందలి యనురాగబంధము తగియే యున్నది. (ప్రకాశముగా) మిత్రుఁడా! నీవు నిక్కము చెప్పుము; ఈమె యందముచే మాయింటిదానిని బోలియున్నదా?

మన్మ—(చిఱునవ్వు నవ్వి) నెచ్చెలీ ఈచిత్తరువునం దున్నది యాచిన్నదాని యందమునం దొకరేఖామాత్రమే సుమీ? అట్లు కానిచో

ఉ. కన్నులబెళుకుమాపులును, గలికిరసాంచితమందహాసమున్
గన్నియకలికిపలుకులును, గామినికన్బొమతీవ్రచొప్పలున్
సన్నుతగాత్రిమేనిబలుసౌరభ, మన్నువచిన్ని నెన్నడల్
చెన్నగుమోవితేనెలును జిత్తరువం దెటులుండు మిత్రమా?

సఖులు—(మెడ లెత్తి చూచి) చెలీ! నమ్ముము; నీచెలువుఁ డింతసేపటినుండియు మెచ్చుచున్నదియు, వ్రాసినదియు నిన్నే.

రతి—(సిగ్గుతోఁ గూడినచిఱునగవుతో) ఓసీ! మీయిప్పటిప్పటియోదార్పుల కేమి లే.

సఖులు—(జనాంతికముగా) ఈమె యీతంత్రమును గ్రహించినదాయేమి? (ప్రకాశముగా) సఖీ! ఇప్పటివేమి? యెప్పుడు నుండఁగలవు.

విదూ—మిత్రుఁడా! నీవు నీకూర్మికిఁ దగినట్లు చెప్పుచున్నావు; కాని, నాకీమె, నీచిత్తరువుచెంత నుంటచేత నిట్టిచక్కఁదనము నొందియున్నదనితోఁచుచున్నది.

రతి—పూజ్యుఁడయినయీతఁడు బాగుగాఁ జెప్పినాఁడు.

సఖులు—ఇదియేకదా! తనవారియందలిపక్షపాతధర్మము: ఏమి నెచ్చెలిచెంత నుంటచే మహాభాగునకు మాత్రము మిక్కిలి చక్కఁదనము కలుగలేదా?

మన్మ—మిత్రమా! అప్పు డప్పూదోఁటనుండి దేవీపూజకై తల్లిగారిచేఁ బిలిపింపఁబడి

వేగముగా వెళ్లుటచేత నే నాప్రియురాలిని దిన్నగాఁ జూడనే లేదు. (అని యత్యాసక్తితోఁ జూచుచు) నెచ్చెలీ!

తే. గీ. కలికిచెలువంబుఁ గాంచుచోఁ గనులలోనఁ
జెలువపలుకులు వినెడుచోఁ జెవులలోన
నాతివాతెరఁ గ్రోలుచో నాలుకలోన
నెనయఁగోరును నాదుసర్వేంద్రియములు.

ఉ. చెక్కులు నొక్కి ముద్దుగొని చిత్తము రంజిలఁజేసి చక్కగా
మక్కువ నెప్డు డాનుదునొ మానినితీయనిమోవితేనియల్?
చొక్కి రతాంతమం దలసి సోలుచు వ్రాలెడుబాల నెప్డు, డే
నక్కుపయి న్వహించి ముదమందుచు కేల సుఖించుచుందునో?

విదూ—మిత్రుఁడా! వెఱ్ఱివానివలెఁ జిత్రగతనుగూడ నిక్కపుఁజెలువనుగాఁ దలఁచుకొనుచున్నా వేమి?

మన్మ—చాలుఁజాలు నీకుఁ బెక్కుపదములు జోడింపనక్కఱలేదు.

తే. గీ. మగువవాతెరయం దుండుమధువువలనఁ
దియ్యబలుకులయొప్పుపూఁదేనెవలనఁ
గొదమగుబ్బలతాళిసంపదలవలనఁ
గొమ్మ నామదికిని వెఱ్ఱి గూర్పకున్నె?

మఱియుఁ జూచినప్పటినుండియు నామె—

చ. కనులసుధాంజనం బిడినకైవడిఁ, గౌఁగిటఁ జేర్చియేమొ చె
ల్మినిఁ జెవిఁ బలుకుచున్నక్రియ, మేనున గంద మలందురీతి, బల్
చనువున మోవితేనియ లొసంగుచు నుండినభాతి, హాయియ
న్వనధిని దేల్చుచున్నగతి వారక తోఁచు నిదేమిచిత్రమో!

విదూ—మిత్రుఁడా! యీమె చిత్రగత యని నేను ముందుగానే చెప్పియుంటినిగదా.

మన్మ—(మఱియొకలాగున ననుకొని యుద్వేగముతో) నెచ్చెలీ! చిత్తగతమాత్రమే కాదు; నాప్రియురాలు చిత్రగతయును (అని మూర్ఛనొందుచున్నాఁడు.)

రతి—(భయముచేవడఁకుచు) చెలులారా! కాపాడుఁడు. కాపాడుఁడు. మహాభాగుఁ డొడలు మఱచుచున్నాఁడు. (అని మూర్ఛనొందుచున్నది.)

సఖు—(విషాదముతో) అయ్యో! ఇదియేకదా దయ్యమును విడిపింపఁబోవునపుడు బేతాళుఁడు పూనుట!

విదూ—మిత్రమా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

మన్మ—(ఊఱడిల్లి నిర్వేదముతో)

ఉ. ఇందుని బోలకున్న మొగ, మిత్తురసోపము లేనిమోవియున్
స్పందము గానిచూపుఁ బృథుభావమునొందనిగబ్బిగుబ్బలున్
మందముగానియూన, మతిమాత్రము గానిపిఱుందు, సూక్ష్మతం
బొందకయున్నవెన్నడుముఁ బూనినబోఁటులకూట మేటికిన్.

సఖులు—ప్రియసఖీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఇదిగో! నీచెలువుఁడు మూర్ఛదేఱి యేమో యోచించుచున్నాఁడు.

రతి—(మూర్ఛదేఱి చూచి) ఓహో! ఎల్లజంతువులును నిప్పుడు మఱలఁ జీవితము నొంది యున్నవి గదా!

సఖులు—(వెనుకకుఁదిరిగి) అన్నా! ఏమే భగవతియోగమహిమ! వేఱొకవీథియందు జరుగుచున్న దంతయుఁ గన్నులఁగట్టినట్లు మన కిక్కడనే కనఁబడుచున్నది!

విదూ—(ఉపహాసముతో) మిత్రుఁడా! ఇంకను ముద్దరాలితనమే విడువని యాకన్నియ వట్టివట్టిచిన్నెలకే మిగులవింతగా నీ వింతగా నుజ్జులాఁగుచున్నా వేమి?

మన్మ—(చిఱునవ్వుతోఁ దనలో) నిక్కముగా నితఁడు పరమఛాందసుఁడే కదా! అహా!

సీ. అలరుసోయగ మూని యలరువాతెఱపైని నంటియు నంటనిపంటిగంటు
కడుహెచ్చుకొనివచ్చు గబ్బిగుబ్బలపైని నాటియు నాటనిగోటిపోటు
మెఱుఁగారునూగారు మీఱువెన్నడుముపై విడియు వీడనిపోఁకముడిబెడంగు
పెనుసిగ్గుఁ గొని కన్గవను మూసికొని మాటిమాటికి వల్దనుమాటనీటు
తే. గీ. గలిగి యలరుచు మంచిమాటలను గొంత
కొంత చేకూరి కోరికల్ కొనలుసాగ
నగుచుఁ బొలుపొందుముగ్ధ యహా నతివపొందు
గలుగునే! మున్న పున్నెముల్ సలుపకున్న?

(ప్రకాశముగా) నెచ్చెలీ! ఆకలువకంటి యీలాటికలాకౌశల మేగురువువలన నేర్చుకొన్నదో కాని—

చ. చిలుకలుఁ, గోయిలల్, వలపుఁజెండెడు గందముఁ, గమ్మతెమ్మెరల్
నెలయును, బుప్పొడుల్, చెలులనీటులుఁ, బాటలుఁ, బూవుఁదోట,లా
యలరులదండ, లామనియు, నాటలు, దేఁటులుఁ బూవుఁదేనెలై
యలరెడునాబలంబులకె హా! వెగటైతిని నే నొకింతలోన్.

రతి—(తనలో) మహాభాగునికి తనబలము లయ్యును నట్లున్నవనునప్పుడు నావంటిదాని
కింక నితవుగా నెట్లుండును?

సఖులు—అయ్యో! ఏమియు నెఱుఁగనిగోల యగునీబాలయం దిట్టినిందను మోపుట
తగవగునా?

మన్మ—ఆహేతువుచేత—

సీ. మంచిగంధముకంటె నించుక కాఁచిచ్చైన హాయిగ నుండు నంచుఁ దోఁచు
నిండారుపండువెన్నెలకంటె బలువేఁడిమించునెండయె మంచి దంచు దోఁచుఁ
బరికింప మల్లెపూఁబాన్పుకంటెను నీఱెయల్లులసజ్జ మేలంచుఁ దోఁచు
గందంపుగొండపై గాలికంటెను వజ్రఘాత మించుక మేలుగాఁగఁదోఁచు

తే. గీ. వేయునేటికి నెచ్చెలి! వినుము బోటి
మేటిగాటంపుఁగౌఁగిట మెలఁగకున్న
బ్రతుకు గల్గుటకన్న నభావమైన
నెంచఁ గడుసంతసం బిడునంచుఁ దోఁచు.

రతి—(తనలో) అయ్యో! కీడు కలుగకుండునుగాక! కీడు కలుగకుండునుగాక! మహా
భాగుఁడా! మందభాగ్యురాల నగునాకొఱకు ముల్లోకములకును మేలొసంగునీ
వీలాగున నెగ్గించుకొనకుము.

సఖులు—అన్నా! పాపము! పరితాపము నిరాశయు నెంతగా నున్నవి!

విదూ—మిత్రుఁడా! నిన్నిట్టివలకాఁకలకుఁ బాల్పఱచినయాకన్నియయునిక్కి యె
ట్లుండెనో?

మన్మ—నెచ్చెలీ! ఆమెయును మిగుల నెడతెగనివగలఁబొగలుచుండుననియే తలఁచెదను.

రతి—(తనలో) స్వభావముచేతనే మెత్తనయినచిత్తము గలయార్యుఁడు బాగుగాఁ
జెప్పినాఁడు.

సఖులు—ఏమి! మనయనుఁగునెచ్చెలి యిట్లు మిక్కిలి యుడుకెక్కి పొక్కుచున్నదని
యమ్మహాభాగునితోఁ బూజ్యురాలయినవశిని యింకను జెప్పలేదు కాఁబోలును.

(తరువాత వశిని ప్రవేశించుచున్నది.)

వశిని—(తనలో) ఎవరును గన్పఱచ నక్కఱ లేకయే నేను, గుమారుని మేడను గనిపెట్టి
నాను గదా! భగవతి యగుసర్వార్థసాధిక "విరహభారముచే మిక్కిలి కలఁగి
యున్నకుమారమన్మథుని, నతనియందు రతికిఁ గలకూరిమిని దెలిపి యూఱడింపు"
మని నన్నుఁ బంచినది. (ఎదుటఁ జూచి) ఇదిగో! కుమారుఁడు తనవేడుక

చెలికానితో ముచ్చటించుచుఁ బండుకొని యున్నాఁడు. కటకటా! వియోగ వేదనచే నెంతగాఁ దూలియున్నవాఁడు!

చ. తనువు కృశించెఁ, దెల్లఁబడెఁ, దద్ద చెమర్చెఁ, గడు న్వడంకఁజొ
చ్చెను, బులకించెఁ, గన్నవయుఁ జెందెను మందత, వేఁడియూర్పు లె
చ్చెను, మతి చింతచేఁ గలఁగెఁ, జిత్తము యోచనసేయు నెద్దియో,
దినశశిపోలె మోము, కడుద్వేషము గల్గె సమస్తరమ్యవ
స్తునికరమందు, మైమఱపుఁ దోఁచును వెండియుఁ దెల్వి గల్గెడున్.

(సమీపించుచున్నది.)

విదూ—(నిరూపించి) మిత్రమా! ఎప్పటియట్ల యుండుము; అదిగో! పూజ్యారాలగు నవశిని యీలాగున వచ్చుచున్నది.

మన్మ—(సంతోషముతో) ఏమీ! భగవతిప్రియశిష్యురా లగువశిని వచ్చుచున్నదా? (లేచి యంజలివట్టి)—పూజ్యురాలా! క్షేమమా? ఇటురమ్ము.

(అందఱును గూర్చుండుచున్నారు.)

విదూ—(పైబట్టకొంగుచేఁ జిత్తరువును గప్పుచున్నాఁడు.)

వశిని—కుమారా! క్షేమమా?

మన్మ—ఇప్పుడు పూజ్యారాలిదర్శనముచేత.

సఖులు—(వశినిని జూచి) మనపున్నెముచేత, నదనునందలివానవలెఁ బూజ్యురాలు వచ్చినది.

మన్మ—ఆర్యురాలా! ఇది కుంటివాని కింటివాకిటనే వేల్పుబేరబ్బుట కదా!

వశిని—కుమారా! మనలో మన కిట్టిగౌరవాలాపనముతోఁ బని లేదుగదా?

మన్మ—పూజ్యురాలా! మంత్రి యగువసంతుఁడు చేసినవిన్నపము భగవతి యంగీకరించినదా?

వశిని—కుమారా! కేవలము భగవతి యంగీకరించుటమాత్రమే కాదు; పుణ్యవశమున నేనిట్లుగూడ సాధించినాను; ఇప్పు డపూజ్యురాలయిన రతి—

ద్విపద. ఒకమాట కొకరీతి నుత్తరం బిచ్చు;
నొకటి కోరినను వేఱొకటి యొసంగు;
నెఱుఁగ దింతయు దినకృత్యంబులందు;
జరిగినకార్యంబు జరుగనిపనియు
నొనరించు నొకపని నొకవిధంబునను;

దనువుఁ జేర్చును రైక తలక్రిందుగాను;
దొడుగును నొకచోటితోడ నొకచోట;
నడిగినఁ గాని మాటాడదు పూని;
మెలఁగు నీపయిఁబాళి మీఱి యీరీతి
జలజాస్త్ర! పరిస్తుత సాహితిపోలె.

మఱియు—

మ. తనువెల్లం బులకింప నింతి తమితో ధ్యానంబున న్నాదు వా
ర్తను వించున్ దశదిక్కులం బెదురుగా స్తబ్ధేక్షణం బొప్ప న
న్గనుచున్ జామునకో తదర్ధమునకో గల్గున్ బ్రియుం గూడఁ గా
ననుచున్ గోరుచు నుండెఁ బ్రాణములతో నాసన్ గళాశేషయై.

రతి—పూజ్యురాలిచే ననుగ్రహింపఁబడినాను.

మన్మ—ఆర్యురాలా! నీవిట్లు చెప్పుటచేత నీచెలిమికత్తెకు మాయందుఁ గూర్మి మెండుగానే యుండెనని తోఁచుచున్నది.

వశిని—కుమారా! కేవలముఁ గూర్మిమాత్రమే కాదు. పరితాపముకూడ మిక్కిలి యెక్కువగానే యున్నదాలకింపుము.

చ. అడుగిడినంతనే కొలనియందలినీరుడుకొంది తగ్గెడున్,
బడఁతి యొకింత కన్గొనిన వాఁడును నిల్వవఁ దీవజొంపముల్,
విడువనివేఁడియూర్పులను విచ్చును వేడుక కొండజాలచాల్,
విడుచునె యిట్టికాఁక నిను వేగమె కౌఁగిటఁ జేర్పకున్నచోన్.

మఱియు నుపచారము చేయుచున్న చెలికత్తెతో నామె యీలాగునఁ బలుకుచున్నది.

సీ. కణకణ యనునగ్నికణము లీగతిఁ దెచ్చి నెమ్మేనఁ బల్మారు నించె దేమె?
వెగడు గావించునీపెనుబాములను దెచ్చి చొరవచే మెయినిండఁ జుట్టె దేమె?
కఱకుఁగత్తులఁ జేర్చి బిరుసుగాఁ గూర్చినశయ్యపైఁ బొరలింప సాగె దేమె?
యలవాఁడి యైన నూఱంచులవాలుచేఁ గనికరం బఱి కొట్టఁగడఁగి తేమె?

తే. గీ. బరువుదోఁచెనె యకట! నాబ్రతుకు నీకు?
నేమి నేయుదు? నీవిట్లు ప్రేమదక్కి
వేయిచేసిన నసువులు విడువ, వయిన
నింక నొనరింపఁగాఁ బూను మిచ్చతోను.

మన్మ—అన్నా! మిక్కిలి వెక్కసమైనయావలయుడుకునకు, దిరిసినవిరులవలె మిగుల మెత్తనై యలరుకోమలియవయవము లెట్టు లోర్వఁగల వని నాడెందము మిగుల గొందలము నొందుచున్నది.

విదూ—మిత్రుఁడా! వెనుకదీయకుము; వినవలసిన దంతయు విందము.

వశిని— చ. ఎదురుగ నేగు నచ్చటికి నీ వరుదెంచితి వంచు భ్రాంతిచే,
ముదమున క్షేమమా యనుచు బూని కవుంగిటఁ జేర్చు వేడ్కతో
నెదను, బదంబులం గడుగ నెంచు, నొసంగును గద్దె, పీచు బల్
మృదువుగఁ దాళవృంతమున మేటివిరాళిని దూలి బాల దాన్.

విదూ—మిత్రుఁడా! మనము గెల్చినాము.

మన్మ—నెచ్చెలీ!

తే. గీ. చెలికి "నీయందుఁ గడుఁగూర్మి గలిగె" ననిన
మదికి నెంతయు సంతస మొదవె మొదల
నిపుడు "కలికికి వలకాఁక హెచ్చె" ననిన
నకట! డెందము కొందల మందుచుండె.

సఖులు—ప్రాణసఖీ! నీకు వినఁదగినది వినుటయుఁ జూడనగునది చూచుటయుఁ దెలియవలసినది తెలియుటయుఁ గలిగినదిగదా? ఇఁక నీవు దిట్టదనము పూని యుండుము.

వశిని—కుమారా! కాఁబట్టి యిట్లొండొరులను వలచియున్నమీయిద్దఱికిని వేగముగా నే తప్పక పొందు కలుగుటకు సందియము లేదు.

మన్మ—ఇది యార్యురాలియాశీర్వచనము గదా!

విదూ—(పడమటదిక్కుచూచి) మిత్రుఁడా! నాకు సంధ్యావందనమునకు వెళ్లుటకు సెలవియ్యవలెను.

మన్మ—ఏమి? సాయంసమయ మైనదా? (నిరూపించి) అవును.

తే. గీ. మేటిరాగంబు నొంది బల్ నీటు చెందు
చెందొవలవిందుతోఁ దగుపొం దొనర్పఁ
దానుగూడను రాగంబు పూని నిండు
వేడ్కతోడుతఁ దొలిదెస వెలయుచుండె.

విదూ—మిత్రుఁడా! ఈపూఁదోఁటలోని తమ్మికొలనునందుఁ దాపమునొందుచున్న యాజక్కవజంటలయవస్థను జూచితివా?

మన్మ— చ. అకట! యొకింత తమ్మిపొదయాకులచాటున నుండి వేగ మొం
డొకటికిఁ గానరామియును నోర్వక యార్చును మూర్ఛ నొందు మా
నక పరుగెత్తు బల్వణఁకునం దురటిల్లు రథాంగయుగ్మకం
బిఁక నిడుపౌవిరాళిబరు వెట్లు సహించెడి నొక్క యానిశన్.

విదూ—(తనలో) మిత్రునకు మఱలఁ గోర్కెను బుట్టించుప్రసంగ మిఁకఁజాలును. (ప్రకాశముగా) మిత్రుఁడా! నీకిది సంధ్యావందనమునకు వెళ్ళవలసినసమయము గదా! కాఁబట్టి నీరాక కెదురుగాఁ జూచుచుండుసామాజకజనమును సంతోషపెట్టుము.

మన్మ—ఆర్యురాలా! నీకును నీసాయంసంధ్యాకాలము సేవింపఁదగినదేకదా?

వశిని—కుమారా! నీకోరిక లీడేరునుగాక.

(మన్మథుఁడును విదూషకుఁడును వెళ్లుచున్నారు.)

వశిని—(విదూషకునివలన విడువంబడినచిత్రపటమును బుచ్చుకొని తనలో) విత్తనములు చల్లుటకు నేలను దున్నునప్పుడు పాతుదొరికినట్లు కుమారు నూఱడింప వచ్చిన నాకుఁ జెలికత్తెయగురతికిఁగూడ వేడుక కలిగించుటకుఁ దగినయాచిత్రపటము దొరికినది; కాఁబట్టి ఇది మయూరికచేతఁ బ్రియసఖియొద్దకుఁ బంపుదును. నాకు సంధ్యావందనసమయ మతిక్రమించుచున్నది. (అని వెళ్లుచున్నది.)

రతి—(నిరూపించి) అయ్యో! అయ్యో! మహాభాగుఁడు కనఁబడఁడేమి? (అబ్బురముతో) మేడయును; ఓసీ! ఇదేమివింత?

సఖులు—నెచ్చెలీ! నీవినోదమును గోరిన భగవతియనుగ్రహముకంటె వేఱేమున్నది?

రతి—(కన్నీరునింపుచు) అయ్యో! ఇది యూరక నన్నూఱడించుటకుఁ జేసినయుపాయమేనా? (అని మూర్ఛ నొంది క్రింది కొరుగుచున్నది.)

సఖులు—(పెక్కుతెఱఁగుల శైత్యోపచారములు చేయుచు విచారముతో) అయ్యో! ఏమిగతి? ఈమె యెంతసేపటికిని దెలివినొందకున్నది; ఇపు డేమియుపాయము! ఎట్లీమె నూఱడింపుదుము? (చింతను నటింపుచున్నారు.)

(ప్రవేశించి)

మయూరిక—అమ్మా! ఇదిగో! "ఇది, మనభర్తృదారికవలవంత నొకింత దొలఁగించు" నని చెప్పి యార్యురా లగువశినిగారు నాచేతి కిచ్చినారు. (చిత్రపటమును గన్పఱచుచున్నది.)

రతి—(పుచ్చుకొని నిరూపించి) ఓసీ! ఈచిత్తరువు నాదే నే.

సఖులు—అవును; కాని, నెచ్చెలీ! దీనియం దిపుడేమో విశేషమున్నట్టున్నది.

రతి—ఏమివిశేషము? (లెస్సగాఁ జూచి తనలో) ఓహో! అమహాభాగునికేల్లాకు నొం దుటకుఁ దగినద్దె నాకంటె నాచిత్తరువే ధన్యమయినదిగదా! (ప్రకాశముగా) ఓసీ! నేనుఁగూడ నిందు వ్రాయఁబడినానే.

సఖులు—ప్రియసఖియు మహాభాగుఁడు నొండొరుల నొక్కచో వ్రాసికొనుట మిక్కిలి చక్కగా నొప్పుచున్నది.

రతి—(కోరికతో మన్మథపటమును జూచుచు) అయ్యో! ఇయ్యానందబాష్పములు కన్నులఁ గప్పి నన్నుఁ దిన్నగాఁ జూడనియ్యకున్న నేమిసేయుదును?

సఖులు—(రతిపటమును లెస్సగాఁ జూచి) ఓహో! విరులుగోయుచున్న మనయనుఁగు నెచ్చెలి నెల్లే సరిగా వ్రాసినయమ్మహాభాగుని విన్నాణ మెంతయుఁ గొని యాడఁదగియున్నదిగదా!

రతి—(చిత్రగతుఁ డగుమన్మథుని జూచి నిందింపుచు) నామనస్సు నెత్తుకొనిపోయిన చోరుఁడా! దొరికితివి లే.

సఖులు—(పరిహసింపుచు) కానిమ్మ. ప్రియసఖి కిట్లయినను గొంతసుఖము గలిగిన మేలే.

రతి—(చిత్తరువు నెద నుంచుకొని సంతోషముతో స్వస్థత నొందుచున్నది.)

(ప్రవేశించి)

సారిక—అమ్మా! ఇదిగో! మీ రిట్లు పరితపించుట తెలిసి యమ్మగారు ఈలాగున వచ్చుచున్నారు.

రతి—(తొట్రుపాటుతో శైత్యోపకరణముల నవయవములనుండి తొలఁగించి) ఏమీ! అమ్మగారే యిక్కడకు వచ్చుచున్నారా? అట్లయిన మనము ముందుగా వెళ్ళి యామెను గౌరవింపవలెను. (అందఱును వెళ్లుచున్నారు.)

ఇది సత్యవోలు కామేశ్వరరాయనిచేఁ దెలిఁగింపఁబడిన
రతిమన్మథనాటకమునందుఁ ద్వితీయాంకము.

శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

## తృతీయాంకము మొదల శుద్ధవిష్కంభము.



(తరువాత నిద్దుర లేక యలసినకన్నులు గలిగి యేమో యోచించుకొనుచుఁ
పీఠమునందుఁ గూర్చుండిన వసంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వసంతుఁడు—(తనలో) అన్నా! మంత్రిగా నుంట మిక్కిలి కష్టతరముగదా!

సీ. ఏలిక నెపుడు శంకించుకొనుచు నుండఁగావలెఁ; దత్ప్రియు గౌరవింప
వలెను; సేవింపఁగావలయు జాగ్రతతోడ నంతఃపురమును; నిరంతరంబు
నెఱుఁగఁగావలెఁ దప్పు లెంచ వేచుచునుండుజనులనిశ్చయమును; శస్త్రధరుల
చేఁ గడు నోరిమిఁ జూపుచుండఁగవలె; నాయవ్యయాదుల నరయుచుండ

తే. గీ. వలెను జ్ఞాపక ముంచఁగావలయు నెపుడు
నాత్మదేశపరివృత్తియు నన్యరాష్ట్ర
మండలియుదంతమును గాన నకట! యించు
కైన మంత్రిపదంబు సౌఖ్యప్రదంబె?

(జ్ఞాపకము చేసికొని) నీతివిదుఁ డయినయొకమహాకవి బాగుగాఁ జెప్పినాఁడు.

చ. వ్యసనము లేక లోకపరిపాలన సేయునతండె రాజు; సం
తసము నొసంగు లోకులకు ధారుణిభర్తకతండె మంత్రి; యో
ధసమితి కాజిఁ దోడ్పడునతండె చమూపతి; కొల్వులోపలన్
మసలక యింపుగాఁ దగినమాటను జెప్పునతండె సభ్యుఁడున్.

మఱియు—

సీ. ఎచ్చోటఁ బ్రభుశక్తి నెఱుఁగకుండునో, మేదినీనాథుఁ డెచ్చట నీతిశాస్త్ర
సారం బెఱుంగఁడో, సచివుండు, నెచ్చోటిసామాజికులు పరస్పరము నెపుడు

నుపకారపరులు గాకుందురో, యెచ్చోటితగవరి స్మృతివిహితంబుగాను తగవు దీర్పరో, యేటికవాయి యెచ్చట నెప్పుడునువిజయుఁడై యెసఁగకుండు

తే. గీ. నెచట నుద్యోగమున నుండు నెల్లజనులు
నుత్తమకులంబులఁ బుట్టియుండరట్టి
రాజ్యమునను వసింపఁగా రాదుసూవె
భవ్యధిశాలియై యుండుపండితునకు.

(విమర్శించుకొని) కాలికి బద్దమోయుచు నడిదారిని విసువుగొనిన నేమిప్రయోజనము? కానిమ్ము; ఇప్పుడు—

ఉ. ఇంచుక ప్రోలిమేడపయి, హెచ్చుగ వెండియు నందనంబునన్
గాంచఁగనైనయట్టిరతికాంతపయిం గడుఁ గూర్మి నొంది యా
చంచలనేత్రకై మదిని సంతతమున్ గడుఁ జింత నొందుచున్
బంచశరుండు మత్ప్రభృతిభక్తులపల్కులఁ దేలఁ డింతయున్.

పూజ్యురాలయినభగవతిప్రియశిష్యురా లగువశిఖవలన రతికిఁగూడ మనదొరయగు మన్మథుఁడుగారియందు మిక్కిలి కూర్మి కలిగియున్నట్టు వినియున్నాను. కాఁబట్టి యిట్లు వీరిద్దఱు నొండొరులను వలచియుంట మిక్కిలి చక్కగా నున్నది.

ఆ. వె. గుజ్జుమావిమోక గురువిందతీవయు
బలెను, జంపురుండు కలువపగిదిఁ,
బ్రొద్దుతమ్మియట్లు పాసఁగ నొండొరులను
వలచువారిపొందె వన్నె కెక్కు.

ఉపేంద్రుఁడు వాచస్పతి నంపి యడిగింపఁగా రతిని మనయేలికయగుమన్మథుని కిచ్చుట కామెతల్లిదండ్రు లొప్పుకొని యున్నారు; కాని, నేనిందుకుఁ బ్రతికూలముగా, వార్తావహులవలన, నామెను శంబరాసురుని కియ్యమని యడుగు కామెతండ్రిగారియొద్దికి శుక్రాచార్యశిష్యుఁ డగుబాహులకుఁడు వచ్చి "మా వంశమందుఁ గన్నియ కిచ్చవచ్చినయతనికే యిచ్చుట యాచార" మనునాస్తి పర్యాయపుమాటను విని వెళ్లినాఁడని విని యున్నాను; కాఁబట్టి పెక్కులు మాయోపాయములు గలయాశంబరుఁ డేమిచిక్కులు పెట్టునో యని చింతింప్రచున్ననామనసున కెంతసేపటికిని స్వస్థత కలుగకున్నది; కానిమ్ము; వాన కురియదని సందేహించి తటియందు విత్తులు చల్లకుండుటయు, నీఁగలు కుట్టునని తే చి తేనెను దీసికొనకుండుటయుఁ దగవు గాదుకదా! పట్టు విడువక పనిసేయు వానికి తప్పక కార్యము నెఱవేఱును; ఇంతే కాక, లోకైకధురంధరుఁ డైనయు

యొడయని కీశంబరుని గెల్చుట యొకలెక్కలోనిదియును గాదు; కాని, ఇప్పుడు, నలువయిచ్చినవరములచే నేపుమీఱి స్వర్గము నాక్రమించినశూరపద్మాది రాక్షసులచే జయింపఁబడినవేల్పుటేఁడు, తనయొజ్జ యగుబృహస్పతిగారితో నాలోచించి యాచెనఁటుల నోడించుటకుఁ దగినశక్తి గలిగినకుమారునిపుట్టుక యగత్యమని నిశ్చయించి, యామంచుకొండయం దెద్దియోకారణంబునఁ దపము చేసికొనుచుండినముక్కంటిని దనకుఁ బరిచర్యచేయుచున్న పార్వతితోఁ గలియునట్లు చేయుటకయి యిందుకుఁ దగినవాఁడును దమ్ముని కొడుకును నగుమనకీనియం దాభారమంతయు నుంచఁదలఁచి యీనడుమఁ గొన్నినాళ్ళనుండి యీయనయెడ మిక్కిలిపేర్మిని గన్పఱచుచున్నాఁడు; కాఁబట్టి మళ్ళించుకొన నలవిగానియీపని యొకటి మిగుల భయంకరమై కనఁబడుచున్నది. (చింత నొంది భయముచే వడఁకుచు)

ఉ. రావణు నేపు మాన్పెఁ, ద్రిపురంబులరూపము మాపె, గొంతునం
దావిసమెల్ల నాఁపెను, గృతాంతున కంతముఁ జూపె, నంధకున్
జే వధియింప నోపె, నొకవ్రేటున బ్రహ్మశిరంబె వాపె, హా!
యేవిధి గెల్వనౌనొ! నిటలేక్షుఁడై తగునట్టిరుద్రునిన్.

(విమర్శించి) అన్నా! సేవకవృత్తియందును శస్త్రజీవనము మిక్కిలి కష్టతరమయినది గదా!

మ. పొడవౌ చొక్కపుమేడలున్, వయసుతోఁ బొల్పారుపూఁబోఁడులున్
గడుపారం బిడుముద్దుబిడ్డలును, రోగం బెన్నఁడున్ లేక మే
లిడఁగాఁ జాలెడుమంచి మేను, గడుహాయిం గూర్చుబల్ కల్మియున్
విడువంగావలె శస్త్రజీవి కకటా! వేవేగ నొక్కింతలోన్.

కానిమ్ము; ఈలాగున నపజయము నెంచుకొననేల? ఇష్టదేవతయనుగ్రహమే తప్పక స్వామికార్యమును నెఱవేర్చును. (దెసలు పరికించి) ఆహా! నేనిట్లు చింతించుకొనుచునుంటచేత నా కీరేయంతయు నంతరములేకయే గడచినట్లు తోఁచుచున్నది. ఇదిగో! ఇప్పుడు—

తే. గీ. వరుణదిశయందు రక్తుఁడౌ వరునియందుఁ
దనకుఁ గలిగినయలుకనో యనఁగ వేఁగ
రాత్రికామిని తారహారంబు లూడ్చె
సవతితన మోర్పలేమి కాస్పదమె కాదె?

మఱియు—

చ. తొలిసగమందుఁ దమ్మిచెలి శోఁచుటఁజేసి విశాలమయ్యె భూ
తల మిపు డంచు, నట్లెసలుఁ దద్దయు గొప్పగ నొప్పెనంచుఁ, దో
వలు నవసృష్టి నొంది యిటు వచ్చె నటంచును, గన్నులబ్బె మ
ర్త్యుల కిపుడంచు నీజగము క్రొత్తగఁ, బుట్టెనటంచుఁ దోఁచెడిన్.

ఆహా!

చ. నిదురను జొక్కు కన్నులును, నీవుల విప్పెడునావులింతలున్
జెదరినకొప్పులున్, ధ్వనులుచేసెడుభూషలు, జారుపైఁటలున్
పదములతొట్రుపాటులును, బల్మఱుఁ గల్గఁగఁ బాన్పుఁ బాసి, యీ
యుదనున వచ్చుచుండ్రు చెలు లల్లనఁ జూపరు లుల్లసిల్లఁగాన్.

(అబ్బురముతో)

ఉ. అందముఁ బాసె రేయిఁ గమలాకరమం చటనుండ కప్పుడిం
దిందిరముఖ్యముల్ సనియెఁ దెంపున నేడకొ వేగ నిప్పు డా
నంద మెలర్ప ఫుల్లనలినం బని వచ్చి నిజేచ్ఛ నుండె, నా
నందము లోనిచుట్టములె యౌదు రొకించుక కల్మి గల్గినన్.

ఇప్పుడు నేనును గాలోచితములను దీర్చుకొని ప్రభుదర్శనమునకు సమయమును వేచుచుందును. (అని లోపలికి వెళ్లుచున్నాఁడు)

(ప్రవేశించి)

కంచుకి—(నిర్వేదముతోఁ దనలో) ఒరులకూటికి చేచాచి తిరుగువానిపుట్టువు మిగుల కష్టతరముగదా!

చ. మన సరికట్టి యింద్రియసమాజము వశ్యముగాఁగఁ బట్టి, భో
జనమును నిద్రయున్ మితిగ సల్పుచు, జీవనమందు సందియం
బును ననయంబు నొందుచును, భోగములం దతికాంక్ష మాని, నే
ర్పునయా నివృత్తిమార్గమున నెయ్యది గావలె దాని నొందెడున్
గన, నవరోధసేవకునికంటెను ధన్యుఁ డిఁకన్యుఁ డుండునే?

(ఆక్షేపించుకొనుచు) చాలిగుంటలోనికుక్కలాగునఁ గడుపుకూటివాని నగు నాకుఁ గలిగెనుక్షణమానపుఁబూర్వజ్ఞాన మిఁకఁ జాలును. ఇప్పుడు నాయేలిక యానతి ననుసరింపుదును. (ముందువైపు చూచి) ఇదిగో! మంత్రి యుగువసంతుఁడుగారిలోగిలి; ఇందుఁ బ్రవేశింతును. (ప్రవేశించుటను నటింపుచు నంతట

ను గలయం దిలకించుచు) ఓహో! అమాత్యునియధికారగౌరవము!

ఉ. ఒక్కెయెడన్ మహాధికృతు, లొక్కెయెడన్ సభికాళి, మాతలిం
కొక్కెకడం, జమూపతులు, నొక్కెడఁ గార్యముఁ గోరియున్నవా
రొక్కెడ, వాకిటం బలసి యొప్పఁగ నొక్కెసితాతపత్రమే
తక్కెవగాఁ బ్రభుత్వమును దాల్చి యెసంగుచునుండె మంత్రి దాన్.

(నివారింపఁబడకయే కక్ష్యాంతరమందున్న వసంతుని సమీపించి ప్రమాణపూర్వకముగా) అయ్యా! పురుహూతుఁడుగారిచేఁ బిలిపింపఁబడి స్వామియగుమన్మథుఁడుగారు పూజ్యులగునమీకొఱకుఁ గనిపెట్టికొని యున్నారు.

వసం—భద్రా! మేమును సిద్ధముగానే యుండి నీరాకకే యెదురుచూచుచున్నాము.

(కంచుకితోఁగూడ వెళ్లుచున్నాఁడు)

ఇది శుద్ధవిష్కంభము.

(తరువాత వసంతునితోఁ గూడిన మన్మథుఁడును మితపరివారమును ప్రవేశింపుచున్నారు.)

మన్మ—(తనలో) మేలు లనునవి తలఁచుకొనునవెల్ల సాధ్యమగునవి కావుగదా! రతియును నేను నొండొరులను వలచియుంటి మని తెలిసి పెద్దలు వేగముగానే మాకుఁ బాణిగ్రహణమహోత్సవము జరుప నిశ్చయించి యుండఁగా నేఁడిట్టి యకార్య మొకటి తటస్థించినది; కాఁబట్టి—

తే. గీ. కొమ్మయెడఁ గల్గమేలైనగుణము లొకటఁ
గడవఁగారానియీ దేవకార్య మొకట
నట్లు విట్టును లాగుచు నకట! నాదు
మల్లమును బట్టి యుయ్యెల లూఁపుచుండె.

(విషాదముతో) కానిమ్ము; మందభాగ్యుఁడనైననే నిట్టివలవంతలకు లోనైతి నని యూరకఁ జింతిల్లను; కాని, నాకొఱకు మిగుల వగలఁ బొగలుచున్న యాసుదతి నెదను దలంచి మిక్కిలి పొక్కుచున్నాను.

చ. కడు నడుఁగొందదే పిడుఁగుకాఁక కరయో! గుసువింద తీవ, కా
ఱడవిని బుట్టుచిచ్చునకు కక్కఱిటు! వాఁడదె లేడిపిల్ల, య
య్యుడుగనియొండచే నడఁకకుఁడునె? చెందొవ మందువేసవిన్
బడలక వెక్కసంపువలవంతల కింతి యొకింత తాళునే?

(విమర్శించి) పరాధీనునికి సుఖ మన నేమి? (ప్రకాశముగా) సచివుఁడా! నిన్నటిరాత్రియందే తండ్రియగుపురుహూతునిచే నాలోచింపఁబడినకార్యమునకు కిక్కిలివేగముగా నేఁటినేకువనే తలఁపునకు వచ్చినానేమి?

వసంతుఁడు—స్వామీ! ప్రభవిష్ణు లగువారు విధాయకముగా జరుగవలసినకార్యముల దెప్పుడును జాలము చేయరుగదా! కానిండు; అయినను నిక్కముగాఁ గీడ మూడు నని యెంచఁదగినయీపనియందు దేవరను నియమించఁదలఁచుటవల నామహేంద్రుఁడుగారు కేవలము స్వకార్యమునే చూచుకొన్నారనితలఁచెదను

మన్మ—అమాత్యుఁడా! మనమ ట్లూహించుకొనరాదు.

తే. గీ. ఏనిపని మంచిదైనను గానిదైన
నలఁపియైనను గాకున్న నతఁడు తనకుఁ
జెప్పినను జెప్పకున్నఁ జెప్పరన పూని
యోగ్యుఁడగుబంటు నకుఁ జేయ నొప్పుఁ గాదె

మఱియు

ఉ. మత్తున నొప్పునేనుఁగులు, మారుతవేగముమీఱు బల్తురం
గోత్తమముల్, నిరంతరసుఖోన్నతి, స్వాశ్రితదైన్యహారియౌ
విత్తముఁ, జాలగౌరవము నేమఱు నిచ్చిన సామికార్యమం
దుత్తములైనభృత్యులకు నొప్పదె మేనులనైన నీయఁగాన్.

వసం—(వినయముతో) అగును; మీరు సెలవిచ్చినది మిక్కిలి బాగుగానున్నది.

మన్మ—(కొంచెమునడచి) ఇదిగో! మహేంద్రుఁడుగారిలోగిలి; ఇందుఁ బ్రవేశింతము.
(వసంతునితోఁగూడఁ బ్రవేశమును నటించుచున్నాఁడు)

వసం—(ఇంద్రసభను జూచి యబ్బురముతోఁ దనలో)

సీ. ఒకవంక నేలయేలికలబా, రొకచోటఁ దెఱగంటిదొరలచాల్ తేజరిల్ల
నొకదారి జడదారులకదంబ మొకచెంతఁ జిలువరాచబిడారు చెన్నుమీఱ
నొకచక్కి గంధర్వనికరంబు, లొకదండఁ బితృదేవతలపిండు పెంపునొంద
నొకచాయఁ గిన్నరప్రకరంబు, లొకసీమ విద్యాధరావళుల్ వెలయుచుండ

తే. గీ. ముచ్చట లెసంగ నచ్చరమచ్చెకంటు
లిచ్చతో నాడి మదులకు మెచ్చుఁగూర్పఁ
జోద్యముగ నుండె నీసభ చూపరులకు
నిండుచెల్వునఁ గన్నులపండు వౌచు.

(ఎదుటనుజూచి) ఇదిగో! అధిపతియైనమహేంద్రుఁ డెల్లవేల్పులచేతను దగినవడువున సేవింపఁబడుచు వాచస్పతితో ముచ్చటించుచు సింహాసనము నలంకరించి యున్నవాఁడు. ఓహో! ఏమి! ఈతనిభాగ్యాతిశయము!

ఉ. ఈమరుదీశునానతి వహించును ముజ్జగముల్ శిరంబులం
దీమహనీయ మైనపద మేరికి రాదు శతాశ్వమేధముల్
దామొనరింపకుండిన, నిధానము సంపద కామధేనుచిం
తామణికల్పకంబులకుఁ దద్దయు నీతనికీర్తులన్ శ్రుతి
స్తోమము మెచ్చు నిప్పదవి చొప్పడనేర్చునె యేరికేనియున్.

(తరువాత వెనుక చెప్పినరీతిని మహేంద్రుఁడు మహావైభముతోఁ బరివారసమేతముగాఁ బ్రవేశించుచున్నాఁడు)

మహేంద్రుఁడు—(సమీపించుచున్న మన్మథుని జూచి వాచస్పతితో) ఆర్యుఁడా!

క. ఎన్నియొ తడవలు గెల్పే
కన్నది తెలిసియు నసాధ్యకార్యముకొఱకీ
చిన్నికుమారుని హరుకడ
కన్నా! పంపుటకు సందియం బగు మదిలోన్.

వాచస్పతి—మహేంద్రా! సోదరునికుమారునందలి ప్రేమాతిశయమున నీ విట్లు పలుకుట యుక్తమే. అదియును గాక భగవంతుఁ డగునావిరూపాక్షుఁడు దుర్జయుఁ డగుటయు సత్యమే. కానిమ్ము; అయినను నితని యుత్సాహమును బట్టి చూడఁగా నితని కీకార్యసిద్ధి కరగతమై యున్న దనుట కింతయు సందియము లేదు. కాఁబట్టి నీవు స్వస్థుఁడ వై యుండుము.

వసం—(నిరూపించి సంభ్రమముతో) స్వామీ! ఇదిగో! మహేంద్రుఁడు స్వభావముచేతనే ఱెప్పపాటులేని దైనను మఱింత స్తిమితముగా నొప్పుచున్న నల్లగ్రుడ్లు గలిగి యలరుచుంటచే మిక్కిలి ప్రేమాతిశయమును సూచించుచున్న తనవేయి కన్నులచేతను గ్రోలుచున్నవానివలె నాసక్తితో నిన్నుఁ జూచుచున్నాఁడు.

మన్మథ, వసంతులు—(వేగముగా సమీపించి వాచస్పతికిని ఇంద్రునికిని నమస్కరించుచున్నారు.)

వాచస్పతి, మహేంద్రులు—(స్నేహగౌరవములను జూపుచు) మీకు జయ మగుఁగాక!

మన్మ—(ఇంద్రునిచే నియోగింపఁబడినగద్దెపయిఁ గూర్చుండి వాచస్పతితో) ఆర్యా ముల్లోకములును నెప్పుడుం దప్పక తనకనుసన్నల మెలఁగుచుండఁగా, జంభ నముచిపులోమపముఖు లగుశత్రువీరులెల్లరఁదనమహాప్రతాపం బనుకాఱిచ్చు నంబడి మిడుతలవలెనుడికి యడుగంటుచుండఁగా,నలవజ్రాయుధము నె చేఁబూని తేజరిల్లుచుండు తండ్రిగారికిని దనసామ్రాజ్యకోటులలో నెల్లఁ గట్టకడనుండునట్టి నే నిట్టు లిప్పు డేమిటికిఁ దలఁపునకు వచ్చితిని?

వాచస్పతి—(సంతోషముతో) కుమారా! పెదతండ్రిగారియెడ నీ విట్టియడఁకువతో మాట లాడుట యుక్తమే; అయినను—

ఉత్సాహ. ఆరయంగ వైజయంత మాజయంతుఁడున్, గృహా
ధారభూత యై యొసంగుధర్మపత్ని యాశచీ
వారిజాక్షియుం ద్రిలోకవైభవంబుఁగూడ నీ
వీరధర్మమున నెకాదె వెలయుచుంటవజ్రికిన్.

మఱియు నిప్పుడు—

ఉ. వక్రితనొందుఁ జక్రి మెట వారుణపాశము మోసమొందెడున్
శక్రుని వాలు దూలు నెట సాగకయుండుఁ బరేతరాజుదం
డక్రమ మయ్యసాధ్యఘటనం బగుకార్యమునందు నీవు ని
ర్వక్రిత రెండొమూడొ పువుబాణము లేసిన శాంతవిద్విష
ద్విక్రముఁడై సురేశ్వరుఁడు వేడుకతోడుత నుండనయ్యెడున్.

మన్మ—(సిగ్గుతోఁ బలె) ఆర్యా! ప్రభువులు భృత్యులను బహూకరించుటయందు సమర్థులుగదా!

మఱియు—

తే. గీ. భృత్యుచే గౌరవముగఁ బిల్పించివేడ్క
నర్ధసింహాసన మొసంగి యభినుతింపఁ
గార్య మింకను సాధింపఁ గలుగనపుడు
హానయగుచుండుఁ గాదె కులీనునకును?

మహేం—వత్సా! ఎల్లలోకములకును మేలు గలిగింపఁజాలునీకార్య మొరులకుఁ జేయ నలవిగాని దగుటచేత నిట్లు కూరిమి విడిచి నిన్నే నియోగింపవలసి వచ్చినది.

మన్మ—(వినయముతో) తండ్రీ! ఏలికలకుఁ గావలసివచ్చినపను లన్నియు దాసులు

తమకుఁ దామే చేయఁదగి యుండును గాదా! కాఁబట్టి,

ఉ. ఏపగవానిఁ బూని కడునేపడఁగింపుదు నంపగుంపుచే
నేపరమర్షి ముంతు నిపు డేవిషయాగ్నిని, బుర్వులాదిగా
నాపరమేష్ఠి దాఁక నెవఁడైనను నాగుఱివిూఱ నేర్చునే
యేపని యేనొనర్తుఁ దడవేటికిఁ దండ్రి! యెఱుంగఁ బల్కవే.

మహేం — బిడ్డా! పార్వతీశ్వరులవలనఁ బుట్టనైయున్న సంతానముచే నీశూరపద్మాది దైత్యు లెల్లను సులభముగా నిగ్రహింపఁ బడుదురని తెలియవచ్చుచున్నది. కాఁబట్టి యాపురాణదంపతులు నిముసమయినను నెడములేక యొండొరులను గూడియుండునట్లు చేయుటకు నీ విప్పుడు ప్రయత్నింపవలెను.

మన్మ — తండ్రీ! వీరద్రుమము నయినను దంశమశకములను గలియునట్లు చేయుటకుఁ జాలినమీ భృత్యుం డగుమన్మథునకు, నొక్కచోట సమావేశమే పొందియుండి న స్త్రీపురుషుల నిద్దఱిని గలిసికొనఁజేయుట న నెంతకార్యము?

మహేం — పట్టీ! నీసామర్థ్య మట్టిదే; అయినను దుస్సాధ్యుఁ డైనయాముక్కంటికడ మిక్కిలి జాగరూకుఁడ వై యుండవలయుఁ జుమీ!

మన్మ — తండ్రిగారియానతిచొప్పున నే చేయుదును.

వాచ — కుమారా! విజయప్రయాణమున కీధనుర్లగ్నమే మిక్కిలి మంచిదని యోచించినాము.

మన్మ — (ఉల్లాసముతో) ఆర్యా! అట్లయిన నిదిగో! నేనును సిద్ధముగానే యున్నాను. (లేచుచున్నాఁడు.)

మహేం — (గౌరవించుచుఁ దనవేణినుండి తీసినమంచిమంచిపూవులు, ప్రాలును నిచ్చి) కుమారా!

క. చేయుము; చేయుము; నేని
కాయముకార్యంబు జయము గలుగున్ నీకున్,
బాయక కళ్యాణియు నీకు
నాయతశుభజాల, మరుగునప్పుడు ప్రోవన్.

మన్మ — (నమస్కరించి వసంతునితోఁ గూడ వెళ్లుచున్నాఁడు.)

మహేం — ఆర్యా! ఈలాటికార్యమునందు బాలుఁ డగునీతనిని నియోగింపుచున్న నేను, ప్రస్తుత మిక్కడ లేకుండుటచేత నీకృత్తాంత మింగుకయు నెఱుఁగనినాయను జన్ముం డగునుపేంద్రున కేమియుత్తరము చెప్పుదును?

వాచ.—మహేంద్రుఁడా! సకలలోకశివంకర మగునీకార్యము పూజ్యుఁడగునుపేంద్రునికిని సమ్మత మయినదే. ఇంతియ కాక, ఈలాగునఁ దనవాఁడని చూడకుండుటయే రాజులకు ధర్మము గదా!

తే. గీ. పరిజనుం డైనఁ గొడు కైన భార్య యైన
మంత్రి యైనను ననుజకుమారుఁ డైన
నెవ్వఁ డేపని కర్హుఁ డౌ నేలికలకు
వాని నందు నియోగింపవలయుఁ గాదె?

(తెఱలో గొప్ప కలకలధ్వని)

వాచ—(ఆలకించి) మహేంద్రుఁడా! తూర్య కాహళీ శంఖదుందుభిధ్వనులవలనఁ గలిగినయిక్కలకలము కుమారుని సేనాసన్నాహసంబంధ మయినదని యూహించెదను.

మహేం—ఎవఁడురా? అక్కడ.

(ప్రవేశించి)

దౌవారికుఁడు—దేవ! ఇదిగో! నేను.

మహేం—భద్రా! ప్రస్థితుఁ డైయున్నకుమారునివృత్తాంత మెప్పటిదప్పుడు మాకుఁ దెలియఁజేయుచుండవలసిన దని చారులతోడను జాంఘికులతోడను జెప్పుఁడు.

దౌవా—చిత్తము (అని వెళ్ళి యొకనిముసములో జాంఘికులతోడఁగూడఁ బ్రవేశించి). దేవా! కుమారుఁడుగారియొద్దకుఁ బంపినవార్తావహులలోనుండి యిప్పుడు వచ్చిన యీజంఘాకారు లిద్దఱును దేవరకు జోహారు చేయుచున్నారు.

మహేం—భద్రా! నీ వీలాగుననే జాగ్రతగా నే నాజ్ఞాపించినప్రకారము చేయుచుండుము. (దౌవారికుఁడు వెళ్లుచున్నాఁడు.)

వాచ—(జాంఘికులతో) కుమారునిప్రయాణవృత్తాంతము మీరు చూచినది చూచినట్లు చెప్పుఁడు.

మొదటివాఁడు—(అంజలిపట్టి) దేవా! యవధరింపుము. దేవరయానతినొదల నిడుకొని మఱల నింటికైనను నరుగక, తనతోఁగూడ రావలసినవారందఱు పయనమగుచు నింకను మేడలయందె యుండఁగాఁ దాను మాత్రము వేగముగా ముందు చిలుకవారువము నెక్కి వీటిని దాఁటి వెళ్ళుచుండఁగా నప్పుడు వసంతుఁడు చూచినంత మాత్రముననే వేత్రహస్తులు పరుగెత్తి మిక్కిలి తొరచేయుటచేఁ జేసియుఁ జేయనిసన్నాహములతోనె వచ్చి సేనలన్నియుఁ గూడుకొనునప్పుడు—

ఉ. దానజలంబుఁ గ్రోలి ప్రమదమ్మున జుమ్మనుతేంట్ల నొప్పుపే
రేనుఁగులున్, వడిం బవను నేనియు మీఱెడువారువంబు, లెం
తేనియు నున్నతిం బరఁగు నెన్నొ రథంబులు, డాలువాలుఁ జేఁ
బూనిన కాల్బలంబులును భూగగనంబులు నిండె దండిగాన్.

మహేం—కానిమ్ము; ఇది సర్వరాజ సాధారణ మయినదే; ఇది గాక, కుమారునివిజయమున కనుకూల మయినమూలబలము సమారంభమును జెప్పుఁడు.

రెండవవాఁడు—దేవా! ఆలకింపుము.

చ. అల మలయాచలానిలము నామనిరేలును జందమామయున్
జిలుకలచాలుఁ గోయిలలచెల్వపుబారులు గండుఁదుమ్మెదల్
లలితము లౌ నెమళ్లపటలంబులుఁ జెల్వున మించునంచప్రో
వులుఁ దెలిగంటిచానలును బొల్పువహించి రహించి రత్తఱిన్!

మహేం—(చిఱునవ్వుతో) ఆర్యా! ఇతఁడు సంగ్రహించినబల మిది!

వాచ—భద్రులారా! వేఱువేఱుగా వివరించి చెప్పుఁడు.

మొదటి—స్వామీ!

చ. అల విరజాజిపూవలపు లంటుచుఁ జోళసుదృగ్జనాళికొ
ప్పుల నలరారుమేల్పొగడపూవులతావులఁ గొంచు, జుమ్మటం
చలులకుఁ బాట నేర్పుచు, యువాళులచెమ్మటయూట లార్పుచున్
మలయనగంబు బందు వగుమందసమీరము మీఱె ధీరమై.

వాచ—సునాశీరా! ఈతఁడు కుమారునివీరుఁడు.

మహేం—తరువాత తరువాత.

రెండవ—దేవా! తరువాత.

తే. గీ. మీఁదిమేడలఁ బడకలు మేనికెంతొ
హాయినిడు కమ్మతెమ్మెర లచ్చమయిన
పండువెన్నెలతేటలు వయసుకాండ్ర
నీటులును మించునామనినిశ లెసంగె.

మొదటి—దేవా!

ఉ. బోటికి మానభేదకుఁడు, బువ్వ సురాళికి, హర్షదుండు ము
న్నీటికి, హాసకుండు కమనీయకుముద్వతి, కంచమిన్న మి

స్నేటికిఁ, గంటి కింపుగలిగించురసాయన మెల్లవారి, కు
చ్చాటనమాంత్రికుం డిరులపంతతి కన్నిసికేఁ డెపంగెఁ దాన్.

వాచ—కుమారుని కీక్క్రీళానిధి మిక్కిలి ప్రియమిత్రుఁడు.

మహేం—తరువాత. తరువాత.

రెండవ—స్వామీ! పిమ్మట.

తే. గీ. పచ్చనై యొప్పుటెక్కలుఁ బవడములను
బోలునెఱ్ఱనిముక్కులుఁ బోలుపుమీఱఁ
గిలకిలయటంచుఁ దీయఁగఁబలుకుకలికి
చిలుకలకులంబు లెలమిని గలుగఁజేసె.

మొదటి—చ. అల కురువిందపాటలము లౌనయనంబుల, నల్లగల్వపూ
వుల నిరసించు మేనులను, బోల్చుచు మావిచివుళ్ళు మెక్కుచున్
గలుగఁగఁ జేసె వీనుల కఖండసుఖం బపు డెల్లవారికిన్
బలుమఱుఁ బంచమధ్వనులఁ బాయక కోయని కూయుకోయిలల్.

వాచ—ఈపికధ్వనులు కాముకులమనము లనుమృగములకు వ్యాధగీతికలు గదా!

మహేం—తరువాత. తరువాత.

రెండవ—దేవా! పిదప.

ఆ. వె. పువ్వుదేనె లాని క్రొవ్వి ఝుమ్మను మేటి
నాదములను నాటి మోద మిడుచు
నిగురునిల్తుబలము నేపొందఁగాఁ జేయు
తేఁటిదాఁటు లెలమినీటుమీఱె.

మొదటి—ఉ. గొనబగు కేరళాంగనలకొప్పుల నొప్పుట కర్హమైనయ
య్యనుపమబర్హముల్ గొడుగుల ట్లలసేనలకొప్ప విప్పి న
ర్తనమొనరింపుచున్ సుమధురం బగు నాజయకాహళీమృదు
స్వనములఁ బోలు కేకల నెసంగెను నెమ్మికులమ్ము లిమ్ముగాన్.

వాచ—ఈనెమ్మిగమి తమ్మిచూలికి సృష్టియందుఁ గలవింత నేర్పులకు నెలవుగదా!

మహేం—తరువాత. తరువాత.

రెండవ—దేవా! పిమ్మట.

క. ముక్కులుఁ గాళ్ళెఱ్ఱగఁదగఁ
జొక్కపువింజామరములసొంపున రెక్కల్

నెక్కొన నడకలు నేర్పుచుఁ
జక్కఁగ జవ్వనులముందుఁ జనె నంచగముల్.

మొదటి—సామీ!

సీ. వలపుగొల్పి పురూరవస్సార్వభౌముని సేవకుఁ జేసె నేచిన్నెలాడి
జడదారిమిన్నయై కడువిఱుకౌశికువ్రతము మాన్పించె నేవన్నెలాడి
సొబగుచే సుందోపసుందుల మేల్తాల్మికలిమి మాలించె నేకులుకులాడి
సరగున రావణాసురుఁడు శాపమునొంద మూలమై యొప్పె నేముద్దులాడి

తే. గీ. యట్టిమేల్సొయగంబుల నలరుచుండు
నూర్వశియు మేనకయును దిలోత్తమయును
రంభ యనునచ్చరలు ససంరంభ లగుచు
నచ్చెరువుదోఁపఁ జెల్వుగా వచ్చి రపుడు.

వారును మఱికొందఱు వారసుందరులును గలిసి—

శా. లీలన్ గుండలముల్ నటింప, బిగిపాలిండ్లున్ జలింపన్, మణీ
మాలల్ చిక్కుపడం, బిఱుందులును వేమాఱున్ భ్రమింపన్, విభూ
షాలుల్ మ్రోయఁగఁ జూడ్కినిల్పిగుఱిదాయన్ దండికల్ దార్చుచున్
కోలాటంబును నాడి రల్లమునులున్ కోర్కుల్ గడున్ జెందఁగాన్.

వాచ—వీరలు కుమారుని యమోఘాస్త్రములే.

మహేం—(సంతోషముతో) ఇప్పుడు కుమారుఁ డెక్కడ నున్నాఁడు?

రెండవ—దేవా! మహేశ్వరు నాశ్రమమునకుఁ గ్రోసెడుదూరము క్రిందుగా నున్నప్పుడు మన్మథుఁడుగారిసెలవునొంది మేము మఱలివచ్చినాము.

వాచ—(ఇద్దఱికిని విడెము లిప్పించి) భద్రులారా! విశ్రమింపుఁడు.

(జాంఘికులు నమస్కరించి వెళ్లుచున్నారు.)

మహేం—ఆర్యా! ముక్కంటియాశ్రమసమీపము నొందిన కుమారుని దలఁచి నాయుల్లము మిక్కిలి తల్లడిల్లుచున్నది.

వాచ—మహేంద్రుఁడా! స్నేహస్వభావ మట్టిదే కదా! అదియును గాక భగవంతుఁడయిన యాభూతపతిగారాశ్రమము భయమున కాస్పద మయినదియును.

(ప్రవేశించి పటాక్షేపముచే)

ప్రతిహారి—దేవా! ఇటు చూడు మిటు చూడుము;

స్రగ్ధర. మిన్నెల్ల న్నీటవారం బెలుచ నిలమహామేదినీజాళు లెండన్
మున్నీట న్నీళు లింకం బొరిశిఖరిశిలల్ ముక్కలై తూల నెంతే
నెన్నం దీక్ష్ణాగ్ని హోత్రం బెసఁగి చటచటానేకరావోగ్రమై దా
నన్నాళీకోద్భవాండం బఖిల మకట! కీలాళిచే నిండుచుండెన్.

మహేం—(సందేహించుచు) ఆర్యా! నిక్కముగా, నిట్లు ప్రబలిన యీమహానలము త్రిలోచనుని విలోకనము వలనఁ బుట్టినదే యని తోఁచుచున్నది. అయ్యో! బాలుని కేమియవస్థ సంభవించినదో కదా! (భయముచేవివశతను నటింపుచున్నాఁడు.)

వాచ—మహేంద్రా! నీలో నీవే యిట్లు శంకించుకొని మోహము నొందుచున్నావేమి! కుమారుని సాముద్రికలక్షణములు నేను జక్కగాఁ గనిపెట్టినాను. మిక్కిలి దీర్ఘాయుష్మంతుఁ డగు నతని కొకకీడు మూఁడునని యించుకయు సందియము నొందఁ బని లేదు.

(తెరలో)

ఆకాశమార్గసంచారు లగుసిద్ధులు—ఓహో! భగవతి యగు సర్వార్థ సాధిక యన్నివిధముల చేతను మన్మథునికి శ్రేయోభివృద్ధి నొనరించు టెంతయు వింతగా నున్నది గదా!

ఉ. వింటను ముల్కిఁ గూర్చునవిల్తునిపైఁ గడునల్గి చూచు ము
క్కంటివిలోచనంబునను గల్గి రయంబున వచ్చి యగ్ని,

(అని సగము వలుకుచుండఁగానే)

మహేం—ఆర్యా! వాక్యశేషపర్యవసాన మెట్లుండునో యని నేను మిక్కిలి జడియుచున్నాను.

వాచ—మహేంద్రా! వాత్సల్యముచే నీ విట్టు లనిష్టమును శంకించుకొనుచుంటివి; కాని, శ్రేయోభివృద్ధి నొనరించు టని పలుకఁబడిన యీమాటవలన మిగుల శుభోదర్కమే సూచింపఁబడుచున్నది గాదా?

(మరలఁ దెరలో)

యా। వెంటనె యీశ్వరీ మహిమపెంపున గర్వముఁ బాసి యేగి యా
కంటనె లీన మయ్యె నధికత్వరఁ గ్రమ్మఱ నద్భుతంబుగాన్.

వాచ—మహేంద్రుఁడా! ఇంకనయినను నీవు స్వస్థత నొంది యుండుము.

మహేం—(సంతోషాతిశయమును నటింపుచు( ఆర్యా! ఇది సిద్ధవచనమే కదా! కాని, కుమారునియొదనుండి చాసు లింకను రాకుండి రేమి?

వాచ—(ప్రశ్నోత్తరములను లెక్కించి) మహేంద్రా! చారు లిప్పుడు సమీపమందే యున్నారు.

(తరువాత చారులు ప్రవేశించు చున్నారు.)

మొదటి—దేవా! వర్ధిల్లుము.

రెండవ—కుమారమన్మథునివిజయముచేత.

మొదటి—దేవా! ఇదిగో! పూజ్యు లగువాచస్పతిగారిపేర మంత్రియగువసంతుఁడుగారు వ్రాసి యిప్పించిన లేఖిక.

(పత్రిక నెదుట నుంచి వెనుకకు వచ్చుచున్నాఁడు.)

మహేం—(వాచస్పతివంకఁ జూచుచున్నాఁడు.)

వాచ—(పుచ్చుకొని సంపుటమును విప్పి పత్రికను జదువు చున్నాఁడు.)

" స్వస్తి, సమస్తసురమస్తకమణిస్తోమరుచిపుంజరంజితచరణు లగుగురువుగారి పాదములకు శిష్యుఁ డగువసంతుఁ డనేకసాష్టాంగనమస్కారములు చేసి చేసికొనువిజ్ఞాపనములు; ఇచ్చట క్షేమము. అచ్చటి క్షేమమును దెలుపఁ గోరుచున్నాఁడను. తరువాత మాసేన లన్నియు హిమవత్పర్వతసమీపమందుఁ బ్రవేశించిన వనుదంతము పూజ్యులయినతమకు జాంఘికులవలన విశదమై యుండవచ్చును; అనంతరము ప్రతిసాయంతనమందును దేజరిల్లుచుండుచకోరకకుటుంబసౌహిత్యనాడింధమచంద్రికాపూరపరిపూరితహరిదంతరుండును, నిజసఖసాహాయ్యకనిస్తంద్రుండును నగుచందురునిచేతను, నిరంతరపరిఫుల్లసంతానకహరిచందనమందారప్రభృతి బృందారకతరుబృందకుసుమసౌరభసారభరస్తేయధీరుం డగుమలయసమీరునిచేతను, సకలప్రపంచవంచనాచణపంచమస్వరప్రపంచనసముత్సుకంబు లగుపికంబులచేతను, నమందమకరందరసనిష్యందమధురిమాధురీణఝంకృతిపరంబు లగుమధుకరంబులచేతను, నుల్లసితభ్రూవల్లీవేల్లితంబును, నుత్తరంగానంగవిభ్రమమధురకిసలయవిసరన్మందహాసంబును, నసుకలతరలతాటంకమణివిభావిభాసితగండమండలంబును నీషదపసరితోత్తరీయాంచలస్ఫుటోపలక్ష్యమాణవక్షోజతటప్రేంఖోలితమౌక్తికహారంబును, నావిష్కృతాంగహారంబును, నతిక్వణత్క్వణకకంకణశ్రేణీసమధికవలన్నితంబబింబాలకాంచీగుణకింకిణీకంబును, నున్మిషన్మంజులమంజీరశింజితంబును, నగునట్లంగీకరింపఁబడినసంగీతలాస్యంబులతో వెలయుకిలికించితంబులచే మునిజనులయంతఃకరణంబులను లోఁగొనునప్సరోగణంబులచేతను, విడిపింపఁబడినయమనియమాదిపరిశ్రమము గలుగునట్లుగా నాశితికంఠునాశ్రమమునందుఁ బ్రవేశించితిమి; అంతలో—"

(ఇట్లు చదువుచుండఁగానే)

మహేం—ఆర్యా! ఈశ్వరునికోపము శమించినతరువాతిసందర్భము ననుసరించి చదువుఁడు.

వాచ—(అట్లు చేయుచున్నాఁడు.) "తరువాత అయ్యా!

క. ఆరాజమౌళి నయనాం
గారముచేఁ దన్ను గెల్వఁగడఁగిన నతనిన్
మారుండె గెలిచె నెంతయు
వీరత గౌరీకటాక్షవిశిఖముచేతన్."

మహేం—(సంతోషముతో) బాగు! బాలకునిప్రతిక్రియ మిక్కిలి చక్కగా నున్నది! తరువాత. తరువాత.

వాచ—"హిమ్మటఁ దనసన్నిధిని సదా శుశ్రూష చేయుచు నుండినపార్వతియందు మిగులఁ గూరిమి గలిగి, యామె నడుగుటకుఁ బంపినవశిష్ఠాదిమహామునులపలుకులకు హిమవంతుఁడు సంతసించి మిగుల మహోత్సవముతో నోషధిప్రస్థపురమునకుఁ బిలిపించి విధ్యుక్తముగా నిచ్చి వివాహము చేసిన గౌరిని దనకు మనికిపట్టగు వెండికొండకుఁ గొనిపోయి సవిలాసముగాఁ గూడియున్న యాయీశ్వరునివలన మన్మథక్రీడావిధాన మంగీకరింపఁబడినది. ఇప్పు డీలాగునఁగూడఁ దెలియవచ్చుచున్నది.

ఉ. ఎంతయుఁ బ్రేమ మీఱఁ బదునేన్గనుదమ్ముల గోప్యముల్ గనన్,
సంతస మొప్పఁగాఁ బదిభుజంబుల నెంతయుఁ గౌఁగిలింప, న
త్యంతపువేడ్కఁ గెంపెదవి నైదుమొగంబులఁ గ్రోల హృష్టయై
మంతనమందు గౌరి హరమానసమున్ హరియింపుచుండెఁ దాన్.

మఱియు భక్తు లెల్లరు నాగౌరిప్రియసహచరి యగువిజయవలన నామెకీలాగున విన్నవించుకొనుచున్నారు.

"సీ. జనని! యీశుఁడు నీదుసాన్నిధ్య మొందుట కించుకైనను సెలవీయకమ్మ
యభిమాన మెంతయు నంది యుండువె కాని కనులెత్తిసుంతయుఁ గాంచకమ్మ
వేమాఱు మిక్కిలి వినయంబుతో నెంత యనునయించినను మాటాడకమ్మ
కరుణింపు మని యెంతగాఁ దాఁ బ్రణామంబు లిడసాగిన ననుగ్రహింపకమ్మ

తే. గీ. భక్తు లానరించుకొను నట్టిప్రార్థనలను
జెవిని బెట్టకుమి వారలు చెడునట్టి

బాధ యెట్లుండునో యది బోధపడును
శివున కీవిప్పు డీరీతిఁ జేసెదేని."

కాఁబట్టి యీలాగునఁ బూజ్యు లయినతమయనుగ్రహమువలనఁ దాను నియమింపఁబడినకార్యమును నెఱవేర్చుకొనిన కుమారునివిజయవర్తమానమును దెలిపి దేవాధినాథునకు సంతసమును గలిగింపవలయు నని కోరుచున్నాఁడను; కొదువ యుదంత మంతయుఁ గుమారుఁ డంపినచారులవలనఁ దెల్లము కాఁగలదు."

మహేం—(ఆనందమును బులకాంకురములును గలుగునట్లుగా) నాకుఁ బ్రియముగా నున్నది. నాకుఁ బ్రియముగా నున్నది.

వాచ—భద్రులారా! నోటిమాటలనుగూడఁ జెప్పుఁడు.

మొదటి—దేవా! కుమారుఁడుగారు, మేనత్తగారిసెల వగువఱకు నక్కడనుండి పిమ్మటఁ దండ్రిగారిపాదములసన్నిధికి వచ్చెద మని మనవి చేయుచున్నారు.

రెండవ—స్వామీ! మన్మథుఁడుగారియొద్దనుండి సెలవు పుచ్చుకొని కైలాసనగరమును విడిచి వచ్చుచు నోషధిప్రస్థపురమునకు వెలుపలనున్నప్రమదవనప్రాంతమం దొక చెట్టునీడను కొంచెముసేపుకూర్చుండి దారియలసటను దీర్చుకొనుచున్నప్పుడు మాకిఁక నొక మేలివార్త కూడఁ దెలిసినది.

మహేం—(సంతోషముతో) అది యెట్టిది?

రెండవ—అక్కడ నవశాత్తుగాఁ గలిసికొని యొండొరులతోఁ జెలిమివలన మాటలాడుకొనుచున్నపూజ్యురా లయినపర్వతరాజుపత్ని యగు మేనకయొద్ద నుండుపరిచారిక లిద్దర కీరీతిని బ్రసంగము జరిగినది.

మొదటిది—"సెచ్చెలీ! ఇవి, యీనడుమ గర్భవతియై యుండినమనయమ్మాయిగారికిఁ దల్లిగారు పంపించుచుండినసహకారజంబీరఖర్జూరదాడిమీఫలములు సుమీ!

రెండవది—ఓసీ! అట్లయిన మనభర్తృదారిక నీరు మోచిన దనుమాట నిజమేనా!

మొదటిది—అందుకు సందేహ మేమి? నిన్న నారజతగిరినుండి విజయవలనఁ బంపఁబడిన శివునిచేటి వచ్చి మనయమ్మగారియొద్ద భర్తృదారికదౌహృదలక్షణము లెన్నుచు—

ఆ.వె. మొగము తెల్లఁబాఱె మిగుల దుర్బల మయ్యెఁ
నడలయందు మిగుల జడిమ దోఁచె
స్థూలతను వహించి తోఁచనయ్యెను గాను
నగలు శిథిల మయ్యె నగజమేన."

మహేం—ఇది నాకు మేలులో మేలు. (అని చారులకు బహుమానము లిప్పించి సెల వొసంగుచున్నాఁడు)

(చారులు జయశబ్దమును బలుకుచు వెళ్లుచున్నారు)

మహేం—ఆర్యా! ఈవర్తమానము వసంతునకుఁ దెలియలేదా యేమి?

వాచ—మహేంద్రా! తఱుచుగా నధిపతులయంతఃపురవార్తలితరులకుఁ దెలియుట సంభవింపదు. ఆమె తల్లిగారియింట నుండుపరిచారికయగుటవలన ముందుగా దానికిఁ దెలిసినది. దానివలన మనచారు లిది విన్నారు. కాఁబట్టి యిఁక దీనినిగూర్చి సంశయించుట కవకాశమును లేదు.

(ప్రవేశించి)

దౌవారికుఁడు—దేవా! కుబేరుఁడుగారియొద్దనుండి ప్రమోదవార్తావహుఁడు వచ్చియున్నాఁడు.

మహేం—భద్రా! ప్రతిహారునిరాక కభ్యంతర మేమున్నది? వేగముగాఁ దీసికొని రమ్ము.

దౌవా—(వెళ్లి పురుషుని దీసికొని వచ్చుచున్నాఁడు.)

పురుషుఁడు—(నమస్కరించి) స్వామీ! దేవరవారియొద్దకు మాయేలిక యగుకుబేరుఁడుగారు పంపించినశుభవర్తమానము.

మహేం—భద్రా! తెలియఁజేయుము.

పురు—దేవా!

"తే. గీ. ఆఱుమోములు చేతు లీరాఱుఁ గలిగి
స్కందుఁ డలగౌరికడుపున సంభవించి
ఖలులఁ బోకియించుశక్తితోఁ గ్రాలుచుండె
నొక్కనాఁడె పదాఱేఁడు లున్నపగిది.

మఱియు నాబాలుఁడు—

ఉ. ఆఱుమొగంబులందుఁ దనయాఱుమొగంబుల ముద్దువెట్టు, నీ
రాఱుకరంబు లెత్తిన నిరాఱుకరంబులఁ గౌఁగిలించు, నే
కోరువ చేరి మోద మిడుచుండును దల్లికిఁ దండ్రికిన్, సదా
వారు శరీర మొక్కటిగ వర్తిలుచుం జెలువొందుచుంటచేన్.

ఇట్లుండఁగా నే యతనిని మన్మథుఁడు సురసేనాధిపత్యమం దభిషిక్తునిఁ జేసినాఁడు; కాఁబట్టి యిఁక మనకుఁ బగతురవలనియాతంకమును శంకించుకొనఁ

బని లేదు" అని మనవి చేయుచున్నారు.

మహేం—ఆర్యా! మంగళ భేరికాధ్వనులును, నర్తకులనృత్యములును జరుగున ట్లాజ్ఞాపింపుఁడు.

వాచ—(అట్లు చేయు చున్నాఁడు.)

(అందఱును మహేంద్రునకు రత్నములు కానుక పెట్టుచున్నారు.)

మహేం—(పురుషునకుఁ దొడవులును బట్టలును బహుమాన మిప్పించి పంపించు చున్నాఁడు)

(తెఱలో)

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము.

మహేం—ఆర్యా! అది యేమో తెలిసికొనవలెను.

(తెఱలోనికి సగము వెళ్లి)

ప్రతిహారి—దేవా! పురజను లందఱును సేనాధినాథునిజననోత్సవపుతొందరయందుండఁగాఁ బూజ్యుఁడయినరాగుఁడుగారికొమార్తె యగురతి, యింతకు ముందు మేడమీఁద నిద్దురపోవుచుండి యిప్పుడు కనఁబడకున్న దని వారియింట నందఱును మొఱపెట్టుచుండుటచేత నీలాటికోలాహలము కలిగినది.

మహేం—(తొందరగా) ఆర్యా! ఏమి? మన కీలాటియపకీర్తి సంభవించినది? అమరావతిమధ్యనే యింతసాహస మెవ్వఁడు చేసియుండును? శుభస్వభావురాలగునారతిని నామెతల్లిదండ్రులు మనమన్మథుని కిచ్చుటకుఁ గూడ నిశ్చయించుకొని యున్నారు. అయ్యో! దేవకార్యము నెఱవేర్చి మఱలి రానైయున్న కుమారుని కేమిసమాధానము చెప్పుదును? కన్నియ నెత్తుకొనిపోయినయాచోరునిజాడ యెట్లు తెలియును?

వాచ—మహేంద్రుఁడా! ఈరతికొఱకు కుమారునితో మిక్కిలి ద్వేషము కలిగియున్న యనేకమాయోపాయములు గలయాశంబరాసురుఁడే యిప్పు డవకాశము చూచుకొని యీపని చేసియుండు నని యూహించెదను.

మహేం—(క్రోధముతో) ఏమి! అసురాధముఁ డెంతపని చేసినాఁడు! (అని లేచి సముద్ధతముగా నడుచుచుఁ బ్రతిహారితో) భద్రా! నీవు వెళ్లి వేగముగా నుద్యోగస్థులతో సేనలను సిద్ధపఱచవలసిన దని చెప్పుము. ఆర్యా! నామిత్రుఁడగు రాగునితోఁ జెప్పి యూఱడింపుఁడు; ఇదిగో! ఇప్పుడే నేను—

చ. ధరపక్షవ్రజఖండవజ్రశవదసృగ్ధారాంకితంబున్, మహో
ద్ధురవృత్రాసురరక్తపారణసముద్యుక్తంబునై యొప్పుభీ

కరతలంబంబున శంబరుం దునిమి వేగంబే రతిం దెచ్చి నా
వరమిత్రుం డగురాగుని న్ముదము నొందం జేయుదున్ రూఢిగాన్.

వాచ—మహేంద్రా! ఇది నీకెంతో పని గాదు; కాని యాశంబరుని మన్మథుఁడు స్వ
యముగా సంహరింపఁ దలఁచుకొని యున్నాఁడని నీవును వినియే యున్నావు
కాఁబట్టి యాకీర్తి కతఁడే భాజన మగుఁగాక!

మహేం—కానిమ్ము. అట్లయిన మేము శత్రునకుఁ బార్ష్ణిగ్రాహుల మగుదుము.

(అందఱును వెళ్లుచున్నారు.)

ఇది సత్యవోలు కామేశ్వరరాయనిచేఁ దెలిఁగింపఁబడిన
రతిమన్మథనాటకమునందుఁ దృతీయాంకము.

శ్రీరస్తు.

# రతిమన్మథనాటకము.

## చతుర్థాంకము.

(తరువాత రాగుఁడును ముదితయుఁ జెలిక త్తెలుఁ బురోహితుఁడును బ్రవేశించుచున్నారు.)

రాగుఁడు—(భయముచే వివశుఁడై)

ఉ. పుట్టితి ముజ్జగంబులను బూజ్యతఁగన్నకులాన, యుక్తమా
ర్గట్టి సమంచుఁ డైనయలయజ్జదకాత్మునిముద్దుపట్టినై
నెట్టనఁ గూర్మి నొందితివి నీతిని దాఁటితి వెల్లబోఁటులన్
పట్టిరో! యట్టినీవు మముఁ బాసి యయో! యెటు లైతివో కదే!

ఉ. అక్కటా! కూళకుక్క మఖమందు హవిర్గ్రహణార్హమైనయా
సంస్రుక్కును బోలె, జాత్యమణిశోభితమాలికఁ గోఁతివోలె, బల్
టక్కరితోడెలార్తిని వడంకెడుజింకను బోలె, నిన్ను నా
ముక్కిడి రక్కసుండు కొనిపోయెనె పట్టి! యిఁకెట్టు తాళుదున్?

ముదిత—(కన్నీరు నించుచు) హాకుమారీ! నీమోముజాబిల్లిని మఱల నెందుఁ గందునమ్మా!

ఉ. ఆదిని నిను మోచుటను నాత్మఁ దలంచుక చింత నొందనా
కాదని వెండియుం బ్రసవకాలపువేదన నెంచుకొందునా
యాదటఁ బెంచునప్పటిప్రయాసము నెంతున, యబ్బురంపునీ
గాదిలియాట లెన్నుదున కాంక్ష నేది తలంతు బిడ్డరో!

చెలులు—(విచారించుచు)

తే. గీ. దంతిపై నెక్కి యూరేఁగుదంపతులను
గాంచి బల్ కౌతుకంబు వహించునప్పు

జేము పరిహాస మొనరింప నెంతొ సిగ్గు
నొందుచుండు వయో! చెలి! యెందుఁ జనితే.

(ఇట్లందఱును మూర్ఛ నొంది మఱలఁ దెలివి తెచ్చుకొనుచున్నారు.)

రాఘుఁడు—(తలఁచుకొని)

ఉ. కోరికమీఱ నాల్కగలకుం దగునట్టివి పెక్కువస్తువుల్
చేరిచి కోరుచీవనుఁగుఁజేడెలతోడుత నాడుచోటికేఁ
జేరుట యెట్టులో కలుగ సిగ్గున దిగ్గునఁ దల్లిచాఁటునం
దూరుచునుండు వెట్టు మఱతున్ నిను నట్టి కుమారికా మణీ!

ముదిత—

సీ. తోడిచేడెలఁ గూడి వేడుకతో నోము లెవరు నోచుదురె మాయింట నిఁకను
పతముసీళులు వోసి చక్కఁగాఁ బూమొక్క లెవరు పెంచుదురె మాయింటనిఁకను
రక్తిమై విసువక రాచిల్కలకుఁ బల్కు లెవరు నేర్పుదురె మాయింట నిఁకను
రహినొయ్యారంబుగా రాయంచలకు నడ లెవరు దిద్దుదురె మాయింట నిఁకను

తే. గీ. అనుఁగుచేడెలతోఁ గూడి యనుదినంబు
పంతమున వింతవింతలౌ బంతులాట
లెవ్వరాడుదు రమ్మ మాయింట నింక
నకటకట! ముద్దుబిడ్డ! యేమైతివమ్మ.

చెలులు—గీ. మొదలఁ దనమేడయం దుండి; పొల్పుమీఱ
నగరవీథిని జనుచున్న నలినశరునిఁ
బొంచి తిలకించి సిగ్గును బొందుచుండు
ననుఁగుఁజెలి! యింతలోనె యేమైతివమ్మ!

(ఇట్లందఱును మఱల మూర్ఛ నొందుచున్నారు.)

పురోహితుఁడు—మహారాజా! మోహపడకుము. ఆపద వచ్చినప్పుడే కాదా ధైర్యము నవలంబింపవలయుట?

(అందఱును నూఱడిల్లుచున్నారు.)

రాఘుఁడు—(చింతింపుచు) ఆమొఱకురక్కసుని వెంబడించిన నామిత్రుఁడగు సుత్రాముని వార్తకూడఁ దెలియకున్న దేమి?

(ఆకాశ యానమునఁ బ్రవేశించి)

చారణుఁడు—(మార్గమధ్యమందే నిల్చి మేడమీఁద నున్న రాఘునిఁజూచి తనలో) పూ

జ్యాఁ డగునీయాన నతిక్రమింపరాదు.

(సమీపించి) అయ్యా! నమస్కారము.

రాగుఁడు—భద్రా! నీవు వేగముగాఁ గుమారజయంతునికి మహేంద్రునివర్తమానము ను జెప్పఁ బోవుచున్నవాఁడ వని తలఁచెదను.

చార—అగును.

రాగు—సంతోషవార్త యేమి?

చార—ఆర్యా! మాకును దెలియునట్లుగా నపహరింపఁబడినరతిని దనతేరిపై నిడుకొని పోవుచున్నశంబరుని వెనుదగిలి, సిద్ధమయినదేవసేనలతోఁ గూడి తొందరగా నంతకవరుణధనదవసురుద్రాదిత్యపరివృతుఁ డగుమహేంద్రుఁడు తరుముచుండ గాఁ ద్రోవయం దాశంబరాసురునిసంబంధము గలశూరపద్మసింహాస్యతారక ప్రభృతు లగురక్కసులు పెక్కండ్రు మిక్కిలిబలముతో నడ్డము వచ్చినారు.

(అందఱును విషాదమును నటింపుచున్నారు.)

రాగు—తరువాత. తరువాత.

చార—తరువాత, తడవులంబట్టి రాజుచున్నక్రోధానలము గలిగినదేవాసురసేన లొం డొంటిపయిం గవియుచుండఁగా

ఉ. అంతఁ జమూసమూహపతి యానమయూరముమీఁద నెక్కి య
త్యంతము వేగ ద్వాదశకరాంచితభీకరదీర్ఘహేతిరై
సంతస మొప్పఁగాఁ బ్రమథసంగతుఁడై చనుదెంచి దానవా
క్రాంతునిఁ గ్లాంతచిత్తుని బురందరుఁ జేరి మహాసహాయతన్.

రా—(ఆశ్వాసముతో) శక్తిధరుఁడు సమయమందే యందుకొన్నాఁడు. తరువాత. తరువాత.

చా—తరువాత, నేను నేనని యొండొరులం దాఁకెడునమరాసురవీరులదృష్టిప్రసారముల నరికట్టురంగదుత్తుంగతురంగఖురపుటోద్ధూతధరాపరాగముల నడఁగించెడిమద కుంభికుంభవిగళద్దానధారాసమూహములచేఁ గర్దమితం బైనయుద్ధప్రదేశంబున నరదంబులు గ్రుచ్చుకొనిపోవుచుంటచే నిష్పందస్యందనంబై పరస్పరాభిఘాతం బులచేత ఖణఖణాయమానం బై తద్దయు నొప్పుపెద్దసంగ్రామంబు జరుగుచున్న సమయంబున,

తే. గీ శక్తిధరుశక్తిచేత వక్షంబు వగిలి
శూరపద్ముండు యమునియాగార మొందెఁ

బోరి నవాబ్జముఖుఁడై సింహముఖుఁడు గూలెఁ
దారుఁ డడఁగెను బర్హ్యస్త్రతారుఁ డగుచు.

(అందఱును హర్షమును నటింపుచున్నారు.)

రాగుఁడు—మహాత్ముఁడు లోకత్రయహృదయశల్యము నున్మూలించినాఁడా?

చార—అయ్యా! నేనికఁ గుమారజయంతునియొద్దకు వెళ్లుటకు సెలవొసంగవలెను.

రాగు—భద్రా! తరువాత కన్యాచోరునివృత్తాంత మేమిజరిగినది?

చార—అయ్యా! ఇట్లు పోరారంభమయినతరువాత నొండొరులపై శరములు వేసికొను నంతవఱకుమాత్రము కనఁబడి పిమ్మట నరదమునుఁ ద్రోలఁగించుకొని యొక్కఁడి కో దూరముగాఁ బాఱిపోయినాఁడు.

(ఇట్లు చెప్పుచునే వెళ్లుచున్నాఁడు.)

(అందఱును మూర్ఛ నొంది పుడమిపైఁ బడుచున్నారు)

పురోహితుఁడు—(ఖేదముతోఁ దొట్రుపడుచు శృంగారోదక మందఱిమీఁదను జల్లి) మహాభాగులారా! యూఱడిల్లుఁ డూఱడిల్లుఁడు. అతిమాత్ర మగునిట్టివ్యామోహముచే నేమిప్రయోజనము?

(అందఱు నూఱడిలుచున్నారు.)

రాగుఁడు—హా! కుమారీ! మిక్కిలి క్రుక్కిడియగునాటక్కిరక్కసుచేఁ జిక్కితివిఁక నెట్లు జీవించి యుందువు?

ముదిత—హా! బిడ్డా! ఈలాటికష్ట మనుభవించుటకేకదా! మందభాగ్యురాల నయిన నాకడుపునఁ బుట్టితివి.

సఖులు—ప్రియసఖీ! ఈలాగునఁ గ్గాసైయున్న నీతో మాకుఁ జెలిమి యేల కలిగెను?

పురో—మహాభాగుఁడా! మార్గమధ్యమునఁ గలిగినబలవత్ప్రతిబంధము . పూజ్యుఁడయిన యాశక్తిధరునిచే నివర్తింపఁబడినది గనుక నింక నాయసురాధముఁ డెందుఁ బోయినను వెంబడించి సంహరించునుగాని వజ్రహస్తుఁ డూరక విడిచి వచ్చువాఁడు గాఁడు.

(ప్రవేశించి)

మయూరిక—(హర్షసంభ్రమములతో) అమ్మా! బాబయ్యగారూ!మీకొకమంచిమాట చెప్పెదను-

రాగు—(ఆసక్తితో) భద్రా! చెప్పుము; మహేంద్రుఁ డమ్మాయిని విడిపించినాఁడా? యేమి?

మయూ—బాబయ్యగారూ! భగవతి యని పలుకవలెను.

రాగు—అదెట్లుగాను?

మయూ—బాబయ్యగారూ! మనయమ్మాయిగారిని రక్కసుఁ డెత్తుకొనిపోయినవార్త చెప్పుటకు మీరు పంపఁగా భగవతియొద్దకు వెళ్ళిననాకిప్పు డమ్మాయిగారక్కడఁ గనఁబడినారు.

ముదితయు, సఖులును—అంతపున్నెమా?

రాగు—ఓసీ! నిజమేనా? నీవట్లు భ్రాంతినొందితివా?

మయూ—బాబయ్యగూరూ! పూజ్యు లయినతమతో నే నబద్ధము మనవి చేయుదునా? భగవతి తనయోగమహిమవలన మనయమ్మాయిగారిలాగున నుండునట్లు మాయావతి యనునొకనాతిని నిర్మించి యాశంబరునరదమం దెవ్వరికిని దెలియకుండ నుంచి యామెను విడిపించినదఁట. ఇట్లు పూజ్యురా లయినవశినిగారు చెప్పినారు.

(అందఱును సంతోషముచేతఁ బరవశు లగుచున్నారు.)

రాగు—(పురోహితునితో) ఆర్యా! యిట్టిది? నేను నమ్మఁజాల కున్నాను.

పురో—మహాభాగుఁడా! ఇది యొంతవింత? భగవతి మహాప్రభావముగలదిగదా! ఇంతియకాక—

క. కలదానిని దొలఁగింతురు
కలిగింతురు లేనిదాని, గగనం బిలగా
నిల మిన్నుగా నొనర్తురు
కలవే సిద్ధుల కసాధ్యకార్యము లెందున్?

ముదిత—(ఉల్లాసముతో) ప్రియసఖ యగుసర్వార్థసాధిక బిడ్డలయందలికూరిమిని వెల్లడిచేసినది.

మయూ—బాబయ్యగారూ! అమ్మగారును మీరును మిక్కిలి దుఃఖించుచున్నారని నేనుజెప్పినతోడనే యమ్మాయిగారిని వెంటఁబెట్టుకొని యిక్కడకు వచ్చుటకు బయలుదేరినభగవతి నన్ను ముందుగాఁ బంపించుటచేత నేను వచ్చుచుండఁగాఁ బూజ్యులయినవసంతుఁడుగారియింటిదగ్గర, కుమారమన్మథుఁడుగారి కెదురుగా వెళ్ళుచు నాకుఁ గనఁబడినవార్తావహుఁ డగుకోకిలకునివలన మన్మథుఁడుగారును బూజ్యు లయినపార్వతీశ్వరులయానతి నొంది యింటికి వచ్చుచున్నా రని కూడ విన్నాను.

రాగు—మాకిది వేఱొక మేలు. ఓసీ! యీకోకిలకునితో, నమ్మాయి విడిపింపఁబడిన వర్తమానమును జెప్పకపోయినావా?

మయూ—బాబయ్యగారూ! సంతోషమున నొడలు మఱచియున్న నే నట్లు చెప్పుట మఱచిపోయినాను.

(ప్రవేశించి)

సారిక—బాబయ్యగారూ! ఇదిగో! భగవతి మనయింటికి వచ్చుచున్నది.

రాగు—(సంభ్రమముతో) అట్లయిన నామె కెదురుగా వెళ్లుదము.

(ఇతరులతోఁగూడ వెళ్లుచున్నాఁడు)

(తరువాత సారథిసమేతముగా రథస్థుఁడగుమన్మథుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మన్మ—(రతిని దలఁచుకొని పరితాపముతోఁ దనలో)

తే. గీ. కడఁగి యిచ్చట వేఱొండుకర్జ మూని
యున్నకతమున నెట్టులో కొన్ని నాళ్ళు
గడచె, నిప్పుడు కాల్చిచ్చుకరణి మఱలఁ
బడఁతియెడబాటు గారింపఁదొడఁగె మిగుల.

అన్నా! నావలెనే ప్రియురాలును విరహానలముచే మిక్కిలి పొక్కుచుండు నని యే తలఁచెదను. పూర్వము నేను తండ్రిగారియానతి నొంది, దేవకార్యమునకై యమరావతినుండి వేగముగా బయలుదేరి వెళ్ళుచుఁ బూఁబోఁడయి సరాగుని, ద్వారసమీపము నొందినప్పుడు

చ. బడలినయంగకంబులును, బల్మఱు నీరులుగ్రమ్ము కన్నులున్,
గడువడి నూర్పుగాడ్పులను గందినమోవియుఁ, బొంది పొందునన్
దడయక చెల్మికత్తె కయిదండ యిడన్ మెడ సాచి చూచుచున్
బడఁతుక మేడపై నిలిచెఁ బాయక నే నటు లేగు టెంచుచున్.

(తలఁచుకొని) ఇదియే గట్టిగా నామనసును బట్టి విడువకున్నది. తల్లిగారిసెల వయినదని యప్పు డప్పూఁదోఁటనుండి వెళ్లుచు—

ఆ. వె. కొన్నియడుగు లరిగి కన్నులనీరానఁ
దిరిగి చూచి "గుజ్జు తియ్యమావి!
యెపుడు మఱలఁ గంటి కింపొనర్తువో" యంచుఁ
గలికి మాటమలిపి పలికెఁ గాదె.

అన్నా! ఇప్పుడు—

చ. కడఁకను బూని యుండెనొకొ! కామిని యేమొనరింపుచుండెనో
కడఁగి యయో! వియోగశిఖకాకఁ బ్రాణము లెట్లు నిల్పెనో
వడి జనునప్పు డామె కనవచ్చినయట్టియవస్థ నెంచి హా!
కడువగ నొందు డెందమునఁ గల్గకయుండునె యెట్టిశంకయున్.

(అపశకునములను సూచింపుచు ఖేదముతో)

మ. అదరంజొచ్చెను వామదృగ్భుజము లత్యంతంబుగా మేనునం
దిదె! బల్ చెమ్మట గ్రమ్మసాగె, మిగులన్ హెచ్చె వడంకొప్పెఁ, దా
నొదవెన్ గద్గదనిస్వనం బకట! యేమోకాని పల్మాఱు నా
హృదయం బింతికిఁ గీడుమూడు నని యెంతేఁ దల్లడిల్లున్ వడిన్.

(ముందువైపు చూచి) భయముతో వచ్చుచున్నవాఁడు మనవార్తావహుం డగు కోకిలకుఁ డని తోఁచుచున్నది.

(ప్రవేశించి)

కోకిలకుఁడు—దేవా! జయ మగుఁగాక! జయ మగుఁగాక!

మన్మ—కోకిలక! అతివేగముగా మఱల వచ్చుచు నీవు మిక్కిలి యస్వస్థహృదయుఁడవై కనఁబడుచున్నావేమి? మేము వచ్చుచున్నా మనువర్తమానము వసంతునికిని నతనివలనఁ, బూజ్యు లగుపెదతండ్రిగారికిని విశదపఱచితివా?

కోకిల—(భయముతో) దేవా! ప్రస్తుతము వసంతుఁడుగా రమరావతియందు లేరు.

మన్మ—(సందేహింపుచు) ఏమి? అతఁ డక్కడ నెందుచేత లేఁడు?

కోకి—(గద్గదస్వరముతో) స్వామీ! శంబరాసురుని దరుముచు వెళ్ళిన మహేంద్రుఁడుగారితోఁ గూడ సైన్యసమేతముగా వెళ్ళియున్నారఁట.

మన్మ—(కోపముతో) ఓరీ! తిన్నగాఁ జెప్పుము.

కోకి—(వణఁకుచు సభయమును గోరుచున్నాఁడు.)

మన్మ—భయము లేదు; ఏమి జరిగినదో చెప్పుము.

కోకి—దేవా! ఆకాశరక్కసుఁడు పూజ్యురా లగురతి నెత్తుకొనిపోయినాఁడఁట.

మన్మ—(కన్నీరు నించుచు) హా! ప్రియురాలా! యేమయిపోయితివో కదా! (అని మూర్ఛ నొంది రథముపై నొరగుచున్నాఁడు)

సారథి—అయ్యమన్మథుఁడా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

మన్మ—(ఊఱడిల్లి కనికరముతో)

ఉ. నామదికిన్ మనంబు నయనంబులకున్ నయనంబు ప్రేమకున్
ప్రేమ సుఖాప్తికిన్ సుఖము ప్రేయసి సర్వధనంబు నాకు, న
కోమలి నైజభీరువగు గో వల బెబ్బులిచేతఁ బోలెఁ బూ
ర్వామరుచేతఁ జిక్కె నిఁక నక్కట! ప్రాణము లెట్లు దక్కునో!

సారథి—ఆయుష్మంతుఁడా! ఇది విషాదమున కదను గాదు; ఆమెను మఱల విడిపించుటకుఁ దగినయుపాయ మాలోచింపవలెను.

మన్మ—సూతుఁడా! ఏమిసేయుదు నిప్పుడు—

ఉ. వ్రీడ నడంచుచుం జెనువివేకము డించుచు మేలితాలిమిన్
వీడఁగఁజేయుచున్ వినయబీజము వాపుచు మేటితాపమున్
మూడఁగ జేయుచున్ మది విమోహము గూర్చుచు నోర! యింతనం
గూడనిరీతిఁ గల్గి యొకగొప్పవికారము నన్గలంచెడిన్.

సారథి—ఆయుష్మంతుఁడా! అగుఁ గాక; అయినను మీరిప్పుడు శత్రువును సాధించుటయం దుత్సాహము నొంది యుంటయే మిక్కిలి శ్లాఘనీయ మైనది.

మన్మ—(ధైర్య మవలంబించి) సారథిశ్రేష్ఠుఁడా! అగును; నీవు బాగుగాఁ జెప్పినావు.

క. ఓదార్పునకుం దగు ప్రియ
మాదరమునఁ జెప్పువార లతిమాత్రము, సం
మోదమున హితముఁ బ్రియమును
గాఁ జెప్పెడువార లసదుగా దె జగానన్.

కోకిలక! మాతండ్రిగారితో, నే నొట్టువెట్టితిననియు మీరందఱు మఱల అమరావతి నలంకరింపవలె ననియు నేనే వెళ్ళి వేగముగా నాదొంగగరువ మడఁగింపుదు ననియు మనవి చేయుము.

కోకి—చిత్తము. (అని వెళ్ళుచున్నాఁడు.)

మన్మ—సూతుఁడా! రథమును వైజయంతపురమునకుఁ బోవు మార్గముమీఁదుగాఁ బోనిమ్ము.

సారథి—(అట్లు చేయుచు నంతటను జూచి) ఆయుష్మంతుఁడా! ఇప్పుడు కలుగుచున్న యీయుత్పాతములను జూడుము. చూడుము.

చ. కలుషతనొందె నద్దెసలు గాఢత వెల్గెడు సూర్యుఁ డెంతయున్
వెలుచ యుగాంతమందుఁబలె వీవఁదొడంగెను. గాలి తీవ్రసన్

మన్మ—(ఉల్లాసముతో)

బలువిలునారిలాగకయె పల్మఱు మ్రోయఁదొడంగె, వేమఱున్
వెలువడఁ జొచ్చెఁ దామగనె వేగ నిషంగమునుండి బాణముల్.

సారథి—(మన్మథుని హర్షమును వృద్ధిచేయుచు) ఆయుష్మంతుఁడా!

తే. గీ. దారుణోత్పాతములు తొల్త దళము కొనియె
నల్ల మలరించుశకునంబు లొదవెఁ బిదపఁ
గానఁ గడు గొప్పకయ్యంబు గల్గియుండుఁ
గలుగునెల్లరు నలరెడు గెలుపు మనకు.

(దక్షిణపు దిక్కు చూచి)

చ. గురుతరమందరభ్రమణఘూర్ణితవారిధియట్ల మ్రోయుభే
రిరవ మెసంగె, నింగి నదె రేణులు గప్పె యుగాంతవారిదో
త్కరములువోలె, మించులవిధానఁ జలింపుచు దిక్కులందు బం
గరపుఁబతాక లొప్పె నటుగాన సమీపమునందె త్రోవయం
దరిభటసేన లుండెనని యాత్మఁదలంచెద నిశ్చయంబుగాన్.

మన్మ—(అవలంబింపుచు) అదృష్టవశమున నాధనుర్వ్యాపారమున కవసరము సమీపించినది.

సారథి—(చింతింపుచు) ఆయుష్మంతుఁడా! ఒక్కవిల్లుమాత్రమే సహాయముగాఁ గలమీకు, మహాబలసమేతుఁ డగునారక్కసుని నిగ్రహింప నెట్లు గెలుగునో యని సందేహింపుచున్నాను.

మన్మ—(విలాసముతో) సారథీ! నాభుజబలము నెఱుఁగనివానివలె నీవును నిట్లాలోచింపుచున్నావేమి?

ఉ. మానితరీతి నేగి హనుమంతుఁడు గెల్వఁడె లంక నొక్కఁడే
మానుగఁ దార్క్ష్యుఁ డొక్కఁడె యమర్త్యులఁ గెల్చి సుధన్ హరింపఁడే
మానక గెల్వఁడే కురుకుమారులఁ బార్థుఁడు గోగ్రహంబునన్
గాన సహాయ మేల? రిపుగర్వ మడంపఁగ నాకు నియ్యెడన్.

సారథి—(ఎదుటను నిరూపించి) మీరథమం దలంకరింపఁబడిన ధ్వజమకరమును జూచి మీరు పోరికి వచ్చుచుండిరని తెలిసికొని మీపగవాఁడు సైన్యమును విడిచి యొంటరిగా నరదమును దోలఁగించుకొని మిక్కిలి దూరముగాఁ బాఱిపోయి నట్టు కనఁబడుచున్నాఁడు.

మన్మ—(సరభసముగా) సూతుఁడా! అట్లయిన శత్రుసేన నెడమవైపుగా విడిచిపెట్టి

మనయరదము నయ్యసురాధమురథమున కెదురుగాఁ బోనిమ్ము.

సారథి—(కశాహతిచే గుఱ్ఱములను వేగముగా నడిపించుచు నాలాగుననే తోలుచున్నాఁడు.)

(తరువాత రథస్థుఁడగుశంబరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

శంబరుఁడు—(మన్మథుని జూచి హేళనముతోఁ దనలో) ఈపంచబాణుఁడు నాచేతనే జిక్కినయిక్కలికిని మఱలించుకొనఁ దలఁచునల కుళింగవిహంగము భంగి ననుసరింపుచున్నాఁడు.

మన్మ—(శంబరునిరథమందుండిన మాయావతిని జూచి విషాదముతోఁ దనలో)

తే. గీ. తతమడుప్రాంతమున మెట్టదమ్మివోలె
వృకముకడ భీతిగొనులేడిపిల్ల వోలెఁ
గటికచీఁకటి లేనెలకలయు వోలెఁ
జెలిచెలువుఁ బాసె రక్కసుచెంత నకట!

మఱియు—

మ. ఎదుటం బేరున నున్ననన్నుఁ గన దొక్కింతైనఁ, దా బాలకిం
చదు మోదంబలరార మామకధనుర్జ్యారావమున్, భీతి
న న్నెదురన్ లే కరిసేన పర్వులిడఁ దా నింతేని సంతోషమొం
దదు, గావన్ జెలి మూర్ఛనొందె ననుచుం దథ్యంబుగాఁ దోఁచెడిన్.

(శంబరు నుద్దేశించి రోషముతో)

ఉ. ఓరి దురాత్మ! రోషసహితోరగదంష్ట్రిను లాగుటే సుమీ!
దీరమృగాధినాథపట లెంపుశఁ జెఱపఁగఁబూనుటే సుమీ!
ఘోరతరాసిధారఁ గడుగొబ్బున నాకఁ గడంగుటే సుమీ!
క్రూరత నిట్టు లీపడఁతిఁ గొల్లను జేకొనఁ గోరు టెన్న గాన్.

శంబరుఁడు—(సోత్ప్రాసముగా) ఓరి పుష్పశరుఁడా! సర్వజనసాధారణ యగుకన్యకకు గాను శంబరునితోనె యెదుర్కొన వచ్చిననీ బుద్ధికుశలత తేటపడినది. రహస్యమునందు స్త్రీపురుషులను గలిసికొనఁ జేయునట్టికార్యము గలిగిననీవీయుద్ధముఖమున నుండి వేగముగాఁ దొలఁగుటయే మేలు. అట్లుగాక నీకును యుద్ధమునందే శ్రద్ధగలుగునేని రమ్ము; అదియుం జూతము.

మన్మ—(కోపములోఁ గూడినచిఱునగవుతో) మూఢుఁడా! ఆత్మస్తవ మిఁకఁ జాలునను. పెక్కుమాటలు నేర్చిననీకు బాణములచేతనే బదులు చెప్పుదును;